# ఆరు కథలు

అనువాదం:

ఎన్. ఆర్. చందూర్

S R Chandur



ప్రతిమా బుక్స్

49 మూకతాల్ వీధి

మద్రాస్—7

AARU KATHALU...

Protima Books, Madras 7

**August 1956**



Telugu Translation of Ambrose Bierce's 'An Occurrence At Owl Creek Bridge' (Publisher: A. & C. Boni Inc. New York), Sarah Orna Jewett's 'A White Heron' (In the Public Domain), Jack London's 'The Heathen' (Publisher: Charmian K. London), Nathaniel Hawthorne's 'The Ambitious Guest' & 'The Great Stone Face' (In the Public Domain), and William Faulkner's 'The Bear' (Publisher: Random House Inc. New York). Translated and Published by kind permission of the respective Authors and Publishers.



Printed At Vinodan Press, 33, Jones Street, Madras—1.

# ఈ పుస్తకంలో

# ఎన్. ఆర్. చందూర్ మిగతా పుస్తకాలు

బాలరాజ్యం
శిక్ష
అంతేనా
కాఫీ మానెయ్యడం
ఎక్కడికి కమలా ?
భానుమూర్తిభార్య
రాధ నవ్వింది
కొత్తలోకాలు
కొన్నిగ్రంధాలు
సీతతో సినిమాకి
నట్టింటదీపం
గ్రామవైద్యుడు
ప్రతి గురువారం
నాలుగురోడ్లు
మాంగుళూర్ మెయిల్
మహాబలిపురం
మనకీ ఒక కారు
సీతాఫలాలు
భాష
పరిచయంచేసిన పుస్తకాలు
పూసలమేడ
అన్యాయం
శివరావు
ఆఖరుకోరిక
కలదో లేదో
అణుశక్తి
ఈ నాగరికత
ఏదవైనా

# ఉరితీయబడ్డ మనిషి

## ఆంబ్రోజ్ బైర్స్

## (1842–1914)

ఓహియో రాష్ట్రంలో జన్మించిన ఆంబ్రోజ్ బైర్స్, అమెరికన్ సివిల్‌వార్‌లో మేజరుగా పనిచేశాడు. యుద్ధానంతరం సాన్‌ఫ్రాన్‌సిస్కో వెళ్ళి, అక్కడ అనేక వారపత్రికా కార్యాలయాల్లో సంపాదకత్వాన్ని వహించాడు. 1872 లో లండన్ వెళ్ళి, నాలుగేళ్ళపాటు అక్కడ వుండి, రచనావ్యాసంగం సాగించి 1876 నాటికి తిరిగీ సాన్‌ఫ్రాన్‌సిస్కో చేరుకున్నాడు. ఆ తర్వాత యిరవై ఒక్కఏళ్లు పత్రికాలోకంలోనే గడిపాడు.

బైర్స్ కథలలో భయంకరమైన మానవాతీత శక్తుల విజృంభణ కనిపిస్తుంది. ఆ కథలు మనకు యిష్టం లేకపోయినా మనం మర్చిపోలేము. అతని కథానాయకులు ఒంటరివాళ్లు; కనిపించని శక్తులు వారి మీద ఎందుకనో పగబట్టి వేటాడుతాయి; చివరికి 'అయ్యో, పాపం!' అనిపిస్తుంది.

# ఉరితీయబడ్డ మనిషి

ఉత్తర అలబామాలో ఒక రైలువంతెన మీద యిరవై అడుగుల కిందునుంచి పారుతున్న నీటి ప్రవాహం చూస్తూ, ఒక మనిషి నుంచున్నాడు. మణికట్లదగ్గిర తాళ్లువేసి, అతని చేతులు వెనక్కి విరగదీసి కట్టారు. మెడ చుట్టూ వొదులుగా ఉరితాడు వుంది. ఆ తాడు రెండవ కొసని వంతెన అడ్డ కర్రల్లో ఒకదానికి బిగించారు. ఆ అడ్డకర్ర యితని శిరసుకి పైగా ఉంది. రైలు బద్దీలపైనున్న కర్రచెక్కలమీద యితనూ, యితనిని ఉరితీయ వలసినవారూ నుంచున్నారు. ఫెడరల్ ఆర్మీకి చెందిన యిద్దరు సైనికులూ, ఒక సార్జెంటూ ఈ మనిషిని ఉరితీయడమనే కర్మ కాండ జరపవలసిఉంది. వీరికి యింకొంచెం దూరంగా ఫెడరల్ ఆర్మీకి చెందిన కెప్టెన్ నుంచున్నాడు. ఈ 'ఉరితీయబడటం' అతని పర్యవేక్షణలో జరగాలి. వంతెనకి చెరోవైపున, తుపాకులు పుచ్చుకు సోల్జర్లు నిలబడ్డారు. వంతెన చివర్ల నిలబడ్డ సోల్జర్లు, వంతెనమధ్య ఏమి జరుగుతోందో తెలుసుకోవడం, తమకి అనవసరమన్నట్లుగా ఉన్నారు.

వంతెనకి ఒక వైపున రైలుబద్దీలు కొన్ని వందల గజాల వరకూ కనిపిస్తాయి. ఆ పైన ఆ రైలుమార్గం అరణ్య ప్రదేశం లోకి జొరబడుతుంది. బ్రిడ్జికి అటువైపున అంతగా అలికిడి లేదు. కాని, యిటువైపున సిపాయిలు చాలామంది ఉన్నారు. వారు

లిమ తుపాకులు వుంచినవిధం చూస్తే, ఏదో కాసేపు విశ్రాంతి తీసుకుంటున్నట్టున్నారు. కర్రలా కత్తి నిలబెట్టి, కుడిచేతిమీద ఎడం చేతిని ఆనించి, వద్దున నిలబడ్డాడు ఒక లెఫ్టినెంట్. వంతెన మధ్యనున్న నలుగురూ తప్పిస్తే, ఎవరికివారు నిశ్చలంగా ఉన్నారు. నదిగట్టున వున్న సైనికులు వంతెనని జడత్వంతో చూస్తున్నారు. వంతెనకి చెరో వైపున, తుపాకులు పుచ్చుకు కాపలా కాస్తున్న సైనికులు, వంతెనను అలంకరించిన శిలా విగ్రహాల్లాగ ఉన్నారు. తన కింద ఉద్యోగులు, తాము చేయ వలసిన పనిని సక్రమంగా చేస్తున్నదీ లేనిదీ, చేతులు కట్టుకు నిలబడి, మాటా మంతీ లేకుండా పరిశీలిస్తున్నాడు కెప్టెన్. అను క్షణం తాము మృత్యుదేవతతో చెలగాటమాడుతున్నా, ఆమెని ఆహ్వానించవలసి వచ్చేటప్పటికి క్రమశిక్షణని అక్షరాలా పాటిస్తారు మిలటరీవారు. ఆమెని సగౌరవంగా పిలిచి, సగౌరవంగా సాగనంపడం వారి ఆచారం.

ఉరితీయబడనున్న వ్యక్తి వయసు ముప్ఫయి అయిదు. వేసుకున్న బట్టల్ని బట్టి చూస్తే, అతను సివిలియన్ అనీ, ప్లాంటర్ (Planter) అనీ తెలుస్తోంది. స్ఫురద్రూపి, పొడుగాటి ముక్కు, కదలికలేని పెదవులు, విశాలమైన నుదురు, వెనక్కి దువ్విన నిడుపాటి పెద్ద జుట్టు, అంతమ్మకి తగ్గ కోటు. మీసమూ చిన్న గడ్డమూ అతనికి అందమిచ్చాయి. తన కంఠం ఉరితాడు మధ్యనున్నా, పత్తికాయలంతటి ఆ నల్లటి కళ్ళలో కరుణ రసమే కానవస్తోంది; అటువంటి భయానక సమయంలో కూడా

సౌజన్యభావం అతని కంటి కొలకులని విడనాడలేకపోయింది. ఇతను సర్వసామాన్య హంతకుడుకాడు. కాని మిలిటరీకోడ్ ప్రకారం అతిక్రమణదారులందరూ నేరస్తులే; వారు పెద్ద మనుషులూ సామాన్యులూ అను పక్షపాతం లేదు మిలిటరీ కోడ్‌కి.

ఉరి తీయడానికి తగు సన్నాహాలు అన్నీ అయాక, చెక్కలమీద నిలబడ్డ యిద్దరు సోల్జర్లూ, కొంచెం దూరంగా తప్పుకున్నారు. సార్జెంటు కెప్టెన్‌కి సాల్యూట్ చేసి, మధ్య చెక్క మీదికి జరిగాడు. యిప్పుడు పరిస్థితి ఎలా ఉందంటే, మధ్య చెక్కకి ఒక వైపున సార్జెంటూ, మరొక వైపున ఉరితీయ బడ నున్న వ్యక్తీ నుంచుని ఉన్నారు. సార్జెంటు ఆ చెక్కమీద నుంచి పక్కకి తప్పుకోగానే, అవతల మనిషి మెడకి ఉరితాడు బిగుసుకుంటుంది. ఉరితీయ బడనున్న మనిషికి ముఖంమీద నల్ల గుడ్డ కప్పబడలేదు; కళ్ళకి గంతలు కట్టబడలేదు; యిరవై అడుగుల క్రిందనుంచి పారుతున్న జలప్రవాహం అతను చూడ గలుగు తున్నాడు. ఆ ప్రవాహంతో నాట్యంచేస్తూ కొట్టుకు పోతున్న ఒక దుంగ, అతని కంటిని ఆకర్షించింది. ఆ కర్ర ఎంత నెమ్మదిగా కొట్టుకు పోతోంది;—ఎంత నెమ్మది, ఎంత నెమ్మది! అతని కళ్ళు ఆ కొయ్యనే వెంటాడాయి.

ఆఖరి సారిగా భార్యా పిల్లల్ని తలుచు కునేందుకు, కళ్లు రెండూ మూసుకున్నాడు. ప్రాతఃకాలపు లేత ఎండలో, కింద పారుతున్న నదీజలం, బంగారు వన్నెలో ఉంది. చుట్టూ కనిపించే

ప్రపంచ మింకా మంచుతెర వొదలలేదు. ఏదో ధ్వని వినిపించింది; ఒక్కసారి కాదు, అలా వినిపిస్తూనే ఉంది—సమ్మెట పోటుల్లా చెవులు చిల్లులుపరిచే ధ్వని. ఆ ధ్వని ఏమిటా అని అతనికి ఆశ్చర్యం కలిగింది. యమదేవత గంటల శబ్దమా?—అనుకున్నాడు. అతిభయంకరమైన దారుణరోదనతో కూడిన రాక్షస శబ్దమది. బల్లెంలతో చెవులుపొడిచినట్లున్నాయి ఆగంటలశబ్దములు. పెద్దపెట్టున కెవ్వుమంటానేమోనని అతనికి భయమేసింది; కాని, తనని తాను నిగ్రహించుకో గలిగాడు. ఇంతా చేస్తే, అతను వింటున్నది తన గడియారపు టిక్ టిక్ శబ్దం!

కళ్ళు తెరిచాడు; క్రింద ప్రవహిస్తున్న నీటిని, మరొకసారి చూశాడు. "ఈ చేతులు వొదిలించుకో గలిగితే, మెళ్లో వున్న తాడు ఒక్కక్షణంలో ఊడతీసుకు, నీటిలోకి దూకెయ్యవచ్చు. నీటిపైకి తేలకుండా లోపలగా ఈదితే, తుపాకీగుళ్ళు తగలకుండా తప్పించుకోవచ్చు. అలా కష్టపడి ఈది, ఒడ్డు చేరుకు, చిట్టడవి గుండా మాయిల్లు చేరుకోవచ్చు. ఆనందధామ మనిపించే మా యిల్లు, భగవంతుడి ధర్మమా అని, ఈ సైనిక పటాలాలకి అందుబాటులో లేకుండా దూరంగా ఉంది," అని ఆలోచించాడతను.

ఈ ఆలోచనలు కాయితం మీద పెట్టేందుకు యింతసేపు పట్టింది గాని అతని మనస్సులో కనురెప్పపాటులో మెరుపులా మెరిశాయి. కెప్టెన్ సార్జెంటుకి సౌంజ్ఞ చేసాడు; సార్జెంటు పక్కకి తప్పుకున్నాడు.

# 2

పేటన్ ఫార్క్వార్ సిరిసంపదలు గల ప్లాంటర్; వారి కుటుంబం అలబామాలోని ఘరానా కుటుంబాలలో ఒకటి; గౌరవప్రతిష్టలు గల కుటుంబము. ఫార్క్వార్ బానిస-యజమాని (slave-owner) అవడంవల్ల, మిగతా బానిస-యజమానులకి మల్లే రాజకీయవాది కాక తప్పలేదు. బానిస-యజమానులు జాతీయ ఐక్యతకంటె, యూనియన్ నుంచి విడి పోదామనే వాదనని (Secessionists) బలపరుస్తూ వచ్చారన్న సంగతి అందరికీ తెలిసిందే! కొన్ని కుటుంబ కారణాలవల్లా, యిక్కడ వివరింప నవసరం లేని యితర కారణాలవల్లా అతను యుద్ధభూమిలో చొరబడలేదన్న మాటే గాని, తను నమ్మిన దానికోసం, ఎటువంటి సాహసం చేయడానికైనా, స్వభావరీత్యా సంసిద్ధుడు. యుద్ధకాలంలో ప్రతివాడూ కొద్దో గొప్పో చేయవలసి ఉంటుంది. తను నమ్మిన రాజకీయ లక్ష్యానికి ప్రాణాలు వొడ్డగల ధీరుడు ఈ ఫార్క్వార్. పైకి సివిలియన్ బట్టలలో ఉన్నా, అంతర్యంలో అతనొక సోల్జర్; ప్రేమలోనూ యుద్ధంలోనూ ఏమిచేసినా "ఒప్పే" అను తరహాకి చెందిన మనిషి.

ఒక సాయంత్రం ఫార్క్వార్, అతని భార్య, వాళ్ళ యింటిముందర వున్న బెంచీమీద కూచుని వుండగా, బూడిద రంగు బట్టలు వేసుకున్న సోల్జరు ఒకడు గుర్రంమీద వచ్చి-దాహం యిప్పిస్తారా!- అని అడిగాడు. గుర్రపుదౌడు ఎంత

దాహంతో వున్నాడోనని, మిసెస్ ఫార్కుహార్ లోపలికి వెళ్లింది, మంచినీళ్ళు తీసుకు వచ్చేందుకు. ఫార్కుహార్ రౌతు దగ్గరికి వచ్చి,- యుద్ధ విశేషా లేమిటి?- అని అడిగాడు.

"ఉత్తర అమెరికనులు, యింకొంచెం ముందుకి పోగేందుకు, రైలురోడ్డు బాగుచేస్తున్నారు. ఇప్పుడు అవుల్ క్రీక్ బ్రిడ్జి (Owl Creek Bridge) దాకా వచ్చి, బ్రిడ్జికి అవతల వేపున అవధి ఏర్పరిచారు. మీరు వినలేదా సైన్యాధిపతి ఉత్తరువు? రైలుబద్దీలుగాని, వంతెనలుగాని, టనెల్స్‌గాని పాడు చేసినా, రైలుబళ్ళు నడకని ఆటంకపరిచినా, అటువంటి నేరస్థులను పరిమితమైన విచారణతోనూ ప్రమేయం లేకుండా, వెంటనే ఉరి తీసెయ్యమని ఆజ్ఞ. ప్రతిచోట తగిలించారు ఆ ఉత్తరువు! నేను కూడా చూశాను."

"అవుల్ క్రీక్ బ్రిడ్జి యిక్కడికి ఎంతదూరం?" అని ఫార్కుహార్ అడిగాడు.

"ముప్ఫయి మైళ్ళు."

"వంతెనకి యివతల వైపున సైనికబలం లేదా?"

"బ్రిడ్జికి చివర ఒక కాపలా సిపాయి ఉన్నాడు; అరమైలు దూరంలో ఒక పికెట్ పోస్ట్ (Picket Post) ఉంది - అంతే"

"మరి, ఎవరైనా తెలివిగలవాడు పికెట్‌పోస్ట్ కనుగప్పి, కాపలా సిపాయిని బోల్తా కొట్టిస్తే, వంతెన కాస్తా బుడుంగు మంటుందో?" అన్నాడు ఫార్కుహార్.

"నల్లాళ్ల క్రింతం నేను అటువైపు వెళ్లాను. నీటిలో కొట్టుకొచ్చిన కలప అంతా, బ్రిడ్జికి ఒకప్రక్కన, గుట్టలావడి ఉంది. అప్పుడు తడి కలప; ఇప్పుడు బాగా ఎండిపోయి ఉంటుంది. అంటుకుందంటే యింక ఆరదు," అన్నాడా గుర్రపురౌతు ఆలోచిస్తూ.

ఈలోపల మిసెస్ ఫార్కుహార్ మంచినీళ్ళు తీసుకొచ్చింది. సోల్జరు ఆ నీళ్ళు తాగి, ఆ యిల్లాలిని అభినందించి, యింటి యజమానికి వందనం చెప్పి వెళ్లిపోయాడు. అదే సాయంత్రం, మరో గంటసేపయాక, ఆ గుర్రపురౌతు ఫార్కుహార్ ప్లాంటేషన్ వైపుగా వచ్చి, ఉత్తరదిక్కుకి మళ్లాడు. అతను ఫెడరల్ స్కవుట్ - అనగా ఉత్తర అమెరికనుల గూఢచారి.

## 3

పేటన్ ఫార్కుహార్ తిన్నగా వంతెనమీదనుంచి కింద పడేటప్పటికి, స్పృహతప్పిపోయి యించుమించు విగతజీవుడయాడు. ఆ స్థితినుంచి అతనికి మెలకువ వచ్చేటప్పటికి కొన్ని యుగాలై ఉంటుంది. మెడమీద ఏదో గట్టిగా నొక్కినట్టూ, ఆపైన ఊపిరాడనట్టూ అయింది. కంఠభాగంనుంచి ఏవో తీవ్రమైనపోట్లు వెలువడి, దేహం నలుమూలలకీ పాకాయి. నరనరమూ ఏదో వేదనతో గిలగిల్లాడింది. శరీరం యావత్తూ అగ్ని నాలుకల నృత్యరంతో భగభగలాడింది. ఈ బాధంతా దేహానిదే. మనస్సుమాత్రం ఊపిరాడక వుక్కిరిబిక్కిరి అయినట్టయింది.

ఆ మనస్సుకి భావనలేదు; ఫీలింగ్ మట్టుకేవుంది. కదలిక ఒక్కటే అతనికి తెలుసు. గడియారంలోని లోలకంలాగ యిటూ అటూ కదులుతున్నట్టూ, పదార్థంలేని చైతన్యంతో కాంతివంతమైన మేఘమాలలోనుంచి తను ప్రయాణిస్తున్నట్టూ అతనికి అనిపించింది. ఉరుము తర్వాత మెరుపులా యిదంతా అరక్షణంలో జరిగింది. ఆపైన అంతా చల్లదనం, అంతా గాఢాంధకారం. మెదడుకి మళ్లీ భావనాబలం వచ్చింది. ఉరితాడు తెగి, తను ప్రవాహంలోకి పడిపోవడం అతనికి తెలిసింది. పీకె నొక్కేతాడు లేదు; కంఠనాళాలదగ్గిర పోటు మాయమయింది; ఎటొచ్చీ, యింక తను నీళ్లు మింగెయ్యకుండా చూసుకోవాలి. ఉరితీయబడ్డ మనిషి, నీటి అడుక్కిపోయి చసిపోవడం ఆశ్చర్యకరంకదూ_ అదేంచావు, అర్థంలేనిచావు. కళ్లుతెరిచేటప్పటికి ఎక్కడో దూరంగా, తనకి అందనంతదూరంలో, కాంతివలయం ఒకటి కనిపించింది. ఆ కాంతివలయం సన్నబడుతున్నకొద్దీ తను యింకా యింకా మునిగిపోతున్నట్టు తోచింది. మళ్లీ ఆ వలయం పెద్దదిగానూ కాంతివంతంగానూ అవనారంభించింది_అంటే మళ్లీ తను పైపైకివస్తున్నాడన్నమాట. తను వున్న చోటు తనకిబాగానే ఉంది; యింకా పైకి రావడమెందుకో! "ఉరితీయబడ్డమనిషి జలమరణం, తుపాకిగుండుతో కాల్చబడటంకంటె మేలే! ఏమైనా, నన్నిప్పుడు తుపాకీగుళ్లతోకాల్చడం ఏం న్యాయం?" అనుకున్నాడు తనలో.

తనను కట్టేసినతాడు విడిపించుకునేందుకు మణికట్లు ప్రయత్నించడం, ఏదో తమాషా చూసినట్టు చూడగలిగాడు.

ఆ తాడు విప్పుతునేందుకు ఆ చేతులు ఎంతశ్రమపడ్డాయి, ఎటు వంటి అద్భుతమైన నేర్పు ప్రదర్శించాయి; ఎంతటి ఘనవిజయం! బంధం విడిపోగానే, చేతులురెండూ అమితోత్సాహంతో, పైకి ఎగిరాయి. మొట్టమొదట అవిచేసిన పనిఏమిటంటే, మెడదగ్గిర బిగించివున్న తాడువిప్పేసి, తమశక్తికొద్దీ దానిని నీటిలోకి గిర వాటువేయడం. నీటిలోకి గిరవాటు వేయబడ్డ ఆతాడుముక్క, నీటిపాములా తేలుతూపోయింది. తాడు విప్పేటప్పటికి నొరుసుకు పోయినమెడ నొప్పిపుట్టింది; మెడదు అగ్నిగుండమయింది; గుండెలు దడదడ కొట్టుకున్నాయి. చేతులు పనిగట్టుకు ఆతాడు విప్పడం తనకి యిష్టంలేదు; తను వొద్దన్నాడు. కాని, చేతులు తన మాట వినందే! తాడు విప్పేసిన ఫలితంగా దేహమంతా జెరులుపొడిచినట్టయింది. చేతులు గబగబ నీటిలోకొట్టుకోవడం మొదలుపెట్టి, శరీరాన్ని నీటిమీాదికి తేళ్చేందుకు తాపత్రయ పడ్డాయి. చిట్టచివరకు తన తలకాయ నీటిపైకి తేలింది; సూర్య కాంతి చూడలేక కళ్లు గభాలున మూతపడ్డాయి; ఊపిరితిత్తులు తమ శక్తినంతటినీ ఉపయోగించి ఒక్కసారి అలిన్ని పైకి నెట్టాయి.

అతనికి యింద్రియజ్ఞానం కలిగింది; చుట్టూ ప్రపంచాన్ని చూడ గలుగుతున్నాడు. తనదేహంలో కలిగిన ఏదో వినూత్న చైతన్యంవల్ల, సృష్టి అంతా కొత్త కాంతులతో కనిపిస్తోంది. తన ముఖాన్ని స్పృశించే నీటి అలలు సన్నని సంగీతమాలాపిస్తు న్నాయి. నదివొడ్డునవున్న చెట్లూ, చేమలూ, అక్కడ నివశించే పురుగూ పుట్రా అతనికి స్పష్టంగా కనిపిస్తున్నాయి. గడ్డిపోచల

ూంది మంచు బిందువులలో యింద్రధనుస్సులు నాట్యమాడు తున్నాయి. తూరీగలరొద తపవనడువుతున్నప్పుడువడే తెడ్ల ప్పంలా ఉంది. అతని కళ్ల ముందు చైతన్యప్రకృతిగానమాధు లో కరిగిపోతోంది. తన పక్కనుంచి ఒకచేప దూసుకుపోవడం చూసి నవ్వుకున్నాడు.

అతను నీటిపైకి తేలివున్నాడు. చుట్టూ ప్రపంచం విస్ప ష్టంగా కనిపిస్తోంది. వంతెన, వంతెనమీదవున్న సోల్జర్లు, సార్జెంటు, కెప్టెన్ వీరందరూ నీలి ఆకాశంలో సిల్హౌటిచిత్రాలలాఉన్నారు. తనివంక వేలుపెట్టి చూపిస్తూ, పెద్దగా అరుస్తూ, యిటూ అటూ తిరుగుతున్నారు; కెప్టెన్ తన పిస్టల్ పైకితీశాడు, కాని కాల్చడంలేదు; మిగతావాళ్ల దగ్గిర ఆయుధాలులేవు. కాని వాళ్ల కదలికా ఆ తీరూ భయాన్ని కలిగిస్తోంది.

చటుక్కున ఒకతుపాకీగుండు తన శిరసుకి కొన్ని అంగు ళాలదూరంలో పేలి, నీటిలోకి దూసుకుపోయింది. ఆ దూసుకు పోవడం కారణంగా తనముఖంనిండా నీళ్లుచిందాయి. వంతెన మీదవున్న కావలాసిపాయి తుపాకీనుంచి మళ్లీ మరొకగుండు పేలడం, నీటిలో మనిషికి కనిపించింది. తుపాకీ తనవైపుగురి పెట్టడం నీటిలోమనిషి చూసి, నేర్పుగా తప్పుకున్నాడు.

ఫార్కుహార్ యిటునుంచి అటుసగం తిరిగేసరికి అదరినున్న కోటలోనుంచి సోల్జర్లపాటలు వినిపించాయి. వారి ప్రాతఃకాల వ్యాయామ సమయమది, "అటెన్షన్, కంపెనీ. షోల్డర్ ఆరమ్స్. రెడీ, ఎయిమ్, ఫైర్." (Attention, Company. Shoulder

**arms. Ready. Aim, Fire)** ఆ పాటలు అతని చెవులలో ములు కుల్లా గుచ్చుకున్నాయి.

ఫార్కు-హార్ నీటిలోపలికి వెళ్లి పోయాడు. ఎంతలోపలికి వెళ్లగలడో, అంతలోపలికి వెళ్లాడు. నీరు, తన చెవులదగ్గిర, నయాగరావలె హోరుమంటోంది. అదుక్కు-పోయినప్పటికీ గుళ్లు పేలడం ధనధనా వినిపిస్తూనేఉంది. మళ్లీపైకి లేచేవేళకి, కాంతి వంతమైన లోహపుముక్కలు తనచుట్టూ కనిపించాయి. కొన్ని అతని మొహంమీాదకీ, చేతులదగ్గిరకీవచ్చి మునిగిపోవడం మొదలెట్టాయి. ఒకటి అతని మెడదగ్గిర గుచ్చుకుంది; కాని లాగి పారేశాడు.

ఊపిరికోసం, మళ్లీ నీటిమీాదకి లేచేసరికి, తనుచాలా సేపటినుంచి నీటి అడుగునవున్నట్టుగా తెలిసింది. ప్రవాహానికి చాలా దిగువకి వచ్చేశాడు తను; యింక, అంతభయం లేదు! సోల్జర్లు తుపాకులు కాల్చడం మానేశారు; కాని, వంతెనమీాదవున్న కావలాసిపాయిలుమట్టుకు నిరర్థకంగా తుపాకీ గుళ్లు వృథా చేసుకుంటున్నారు.

వేటాడ బడుతున్న మనిషి, తన వీపుమీాదుగా, ఒక్కసారి వెనక్కి చూసుకున్నాడు. ప్రవాహంతో బాటు తను అతి వేగంగా కొట్టుకుపోతున్నాడు. కాళ్ళూ చేతులూ ఎంత శక్తి వంతంగా పనిచేస్తున్నాయో, మెదడు కూడా అదే విధంగా పని చేస్తోంది.

“యిన్ని తుపాకులు నన్ను తుదముట్టించేందుకు కాసుకుని వుండగా, ఎవరు కాపాడగలరు నన్ను? ఆ భగవంతుడే కాపాడాలి,” అనుకున్నాడు.

తనకి రెండు గజాల దూరంలో, నీటిలో పెద్ద శబ్దమయింది. ఏదో పేలిన శబ్దం. ఆ పేలుడు తిన్నగా నదీగర్భంలోకి పోయింది. పేలుడువల్ల ఏర్పడ్డ అలలు, ఉధృతంగా లేచి, వొడ్డుని తాకుతున్నాయి. తన మీదుగా పెద్ద పెద్ద కెరటాలు లేచి, తనని కిందికి ముంచాయి; కళ్లు కనపడక, చెవులు వినపడక, ఊపిరాడక ఉక్కిరి బిక్కిరి అయాడు. ఆ పేలినది ఫిరంగి కాబోలు! చుట్టూ ప్రదేశం ఆ ధ్వనితో దద్దరిల్లింది. ఆ ధ్వనికి నదీ తీరాన వున్న చెట్ల కొమ్మలు అల్లల్లాడ్డమే గాకుండా, కొన్ని చెట్లు ఫెళ్లున విరిగి వూరుకున్నాయి.

“ఫిరంగి మళ్లీ పేలుస్తారు; ఒక్కసారితో ఊరుకోరు. ఫిరంగి పొగ చూశాక, నేను చటుక్కున మునిగిపోవచ్చు. పొగ కనిపించడానికీ గుండు పేలడానికీ మధ్య, కొంచెం వ్యవధి ఉంటుంది. ఏమైనా, ఈ ఫిరంగికి కాస్త దయాగుణం ఉంది,” అనుకున్నాడు ఫార్కుహార్.

ఇంతలో ఆ ఫిరంగి గిరగిర తిరగడం మొదలుపెట్టింది. నీరూ, గట్లూ, తీరాన వున్న చిట్టడవీ, దూరాన వున్న వంతెనా, కోట, కోటలో మనుషులూ అంతా అల్లకల్లోలం అయిపోయింది. వస్తువులు వాటి వాటి రంగుల్లోనేగాని రూపాల్లో కనిపించడం మానేశాయి. నిలువుగానో, వంకరగానో రంగుల రూపంలోనే, లోకమంతా కనిపించింది. అతనొక సుడిగుండంలో చిక్కుకున్నాడు.

మతి పోగొట్టే మహోద్వేగంతో ఆ సుడిగుండం అతన్ని ముంచి, ఎడంవైపు గట్టుమీదికి గిరవాటు వేసింది; ఆ ఎడంవైపునా, కొంచెం దక్షిణదిక్కుగా, శత్రువులకి కనిపించని చోట పడేసింది. కదలిక ఆగిపోడంతో, వొడ్డుమీద రాళ్లు చేతులకి గీసుకోవడంతో, అతని కళ్ళు తెరువులకి వచ్చాయి. ఆ పట్టరాని సంతోషంలో పెద్దపెట్టున ఏడవాలనిపించింది. తనవేళ్లు ఇసుకలోకి పోనిచ్చాడు. గుప్పిళ్లతో ఇసుక తీసుకు, అది వంటిమీద పోసుకుంటూ ఆనంద బాష్పాలు రాల్చాడు. ఆ యిసుక బంగారం కంటె, వజ్రాలకంటె, నవరత్నాలకంటె అమూల్యంగా ఉంది; ఆ యిసుకకంటె అందమైనది ఈ సృష్టిలో లేదు. గట్టునవున్న చెట్లు పొడుగ్గా, పెద్దవిగా ఉన్నాయి; ఆ చెట్లపూలనుంచి వచ్చే సువాసన అతన్ని ఆనంద పరవశునిగా చేసింది; ఆ ఆకుల గలగల అమరగానంలా ఉంది. అక్కడనుంచి పారిపోయి, ప్రాణం కాపాడుకోవాలని, అతనికి అనిపించలేదు; శత్రువులు తనని పట్టుకునేదాకా ఆ ప్రదేశంలో వుండిపోగలిగితే బాగుండు ననిపించింది.

కాని, చెట్ల ఆకులలోనుంచి, ఏదో తుపాకీగుండు దూసుకుపోయిన చప్పుడు వినపడగానే, పారిపోయేందుకు అతని కాళ్లు లేచాయి. నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ చిట్టడవిలోకి ప్రవేశించాడు.

ఆ రోజంతా అతను నడుస్తూనే ఉన్నాడు; పేల్చేసే ఎండలో నడుస్తూనే ఉన్నాడు. ఎంత నడిచినా, ఆ అడివికి తుదీ మొదలూ కనపడటంలేదు. తను నివసిస్తున్న ప్రదేశం చుట్టూ,

యింత బ్రహ్మాండమైన అడవి ఉన్నట్టు, యిన్నాళ్ళబట్టీ తనకి తెలియనే తెలియదు.

చీకటి పడేవేళకి పాదాలు బొబ్బలెక్కాయి; కడుపులో కలకలమంటూంది. మనిషి పూర్తిగా అలిసిపోయాడు. కాని, భార్యాపిల్లల గురించిన తలంపు అతన్ని ముందుకి నెట్టింది. చిట్ట చివరికి ఒక రోడ్డు కనిపించింది; పట్నవాసంలో వీథిలాగ విశాలంగా ఉంది ఆ రోడ్డు. కనుచూపు మేరలో పొలాలుగాని, ఇళ్ళుగాని లేవు. సమీపంలో మనుషులు నివశిస్తున్నారనే సూచనగా, ఆఖరికి కుక్కల అరుపులుకూడా లేవు. రోడ్డుకి యిరు ప్రక్కలా పెద్దపెద్ద చెట్లుమాత్రం ఉన్నాయి. తల ఎత్తేటప్పటికి ఆకాశంమీద నక్షత్రాలు వింత కాంతులతో వెలుగుతున్నాయి; అసలా నక్షత్రమండలాన్ని ఎవరో కొత్త పద్ధతిలో అమర్చినట్లు వుంది. చెట్ల పొదలలోనుంచి వచ్చే శబ్దాలు ఏవో కొత్త కంఠాలవి.

మెడ దగ్గిర నొప్పిగాఉంది; చెయ్యి పెట్టుకు చూసుకున్నాడు; మెడ బాగా వాచింది. తాడువేసి కట్టినచోట, మెడ కమిలిపోయింది. కళ్ళు ఏమిటో పెట్లుడు గుడ్లలా అయాయి–కళ్ళు మూయలేకపోతున్నాడు. దాహంతో నాలుక పిడచ గడుతోంది; గాలి తగిలి చల్లబడేందుకు, నాలుక అప్పుడప్పుడు బయటికి చాస్తున్నాడు. కాళ్ళు తేలిపోతున్నాయి. పచ్చగడ్డి మీద ఎగురుతున్నట్టు వుంది.

ఇంత బాధలోనూ నడుస్తూ, నిద్రపోతున్నాడు. నిద్రలో కూడా నడక ఆపడంలేదు. కళ్ళు తెరిచి చూస్తున్నప్పుడలా కొత్త దృశ్యం కనిపిస్తోంది. కడపటికి తనయింటి గేటుముందుకి వచ్చి నిలబడ్డాడు. తను పొద్దున్న వెళ్లినప్పుడు ఎలాఉందో, యిప్పుడూ అలానే, ఉదయకాంతిలో, అతి సుందరంగా ఉంది తన గృహ వాటిక. అయితే, తను రాత్రి అంతా నడుస్తూనే ఉన్నాడన్న మాట. గేటు తెరుచుకు, నాలుగు అడుగులు లోపలికి వేసే సరికి గాను గలగల వినిపించింది. తన అందాల రాసి, తన కాంతి కిరణం, తన భార్య వరండాదిగి వస్తోంది. తనని ఆహ్వా నించేందుకు, మెట్లుదిగువని నుంచుంది, అమృతంచిలికే ఆ ఆనంద మూర్తి! ఎటువంటి మధుర హృదయం తన భార్యది! రెండు చేతులూ చాచుకు, ఆమెపైపు గబగబా పరిగెత్త బోయాడు; మెడ దగ్గిర తంగ్ మంది;-ఒక్కసారి తళుక్కున కాంతి వెలిగి, ఆపైన అంతా చీకటి అయిపోయింది; అంతా నిశ్శబ్దం.

పేటన్ఫార్కుహార్ చనిపోయాడు. ఉరి తీయబడ్డ అతని దేహం, అవుల్ క్రీక్ బ్రిడ్జి అడ్డ కర్రల మీద, యిటూ అటూ ఊగిసలాడింది.

# నారాయణపక్షి

## సారా ఆర్నిజ్యూయెట్

## (1849—1909)

"నీకు తెలిసిన విషయాలు, ఉన్నవి వున్నట్టు రాయి," అని సారా ఆర్నిజ్యూయెట్, విల్లాకేథర్ కి, సలహాయిచ్చింది. సారా రచనల్నిబట్టి, న్యూఇంగ్లండు ప్రజలకు, ఆమె యథాతథంగా నివేదించినదని మనం భావించవచ్చు. న్యూయింగ్లండులో ఏమి కనిపించిందో, అది రాసింది. ఆమెరాసినకథలు ఈనాడు ఎక్కువమంది చదవకపోయినా, ఆమెపెట్టిన వరవడి చాలామంచి రచయితలు అనుసరించారు. మెయినీరాష్ట్రంలో సత్కుటుంబీకుల యింట జన్మించిందీమె. సారా మొదటిపుస్తకం "డీప్ హావెన్" 1887 లో ప్రచురితమయింది. ఆత్మకథరూపంలోఉన్న ఈ రచన, ఆ నాటి న్యూయింగ్లండ్ ప్రజా జీవితాన్ని ప్రతిబింబిస్తుంది. తర్వాత ఆమె అనేక నవలలు కథలు ప్రచురించింది; వాటన్నిటిలోనూ న్యూయింగ్లండు జీవితం సుస్పష్టంగా గోచరిస్తుంది.

# నారాయణపక్షి

జూన్ నెలలో సాయంత్రంవేళ. అడవిలోని చెట్లనీడలు పొడవయ్యాయి. ఆ నీడలమధ్యగానూ, చెట్టుమొదళ్ల పక్కనుంచీ సూర్యాస్తమయం తళతళలాడుతోంది. ఒకచిన్నమ్మాయి ఆవుని తోలుకుంటూవస్తోంది; ఆ అమ్మాయికి ఆవు సాయం; ఆవుకి ఆ అమ్మాయి సాయం. ఒకరికొకరు ఆత్మీయులు. తామిద్దరూ పూర్తిగా చీకటిపడకపూర్వమే అడవి దాటాలి రోజూవచ్చిపోయే ఆ దారి, వారిద్దరికీ తొక్కినబాట. అంచేత, కళ్లు ఏ దిక్కులుగాచూసినా, కాళ్లుమాత్రం ఒకేదారి వెంట తమని తీసుకుపోతాయి.

ఆ ఆవు ఏనాడూ దారి తప్పలేదు, వెనక దిగబడలేదు; కాని, దానిమనసులో_ ఒక్కరోజురాత్రి ఆ పొదలచాటున దాక్కుంటే ఏమవుతుందో చూడాలని ఉండేది; దానిమనసులో ఎంతోకాలంగా గూడుకట్టుకు నివశిస్తున్నకోరిక అది. తను యిటూఅటూ కదలక, నిశ్చలంగా నుంచునివుంటే, మెళ్లోగంట మోగదనికూడా దానికి తెలుసు. ఒక్కసారి తమాషాచేస్తే ఎలా ఉంటుందో !

సెల్వియా "కూహ్" "కూహ్" అని అరిచేటప్పటికి, ఆవు "మూ" అనలేదు. ఉత్తప్పుడయితే ఆవు తనతో ఈవిధంగా దాగుడుమూతలు ఆడటం సెల్వియా సహించివుండేదిగాని ఒక

పక్క చీకటి పడుతూంటే, యిలాటిసమయంలోనా ఆటలు? నాలుగువైపులా వెతకడం మొదలుపెట్టింది. బురదగుంటపక్క నున్న పొదలచాటున గోమాత దాక్కునివుండటం సెల్వియా కనిపెట్టి, చిరునవ్వుతో ఆమెని పలకరించి, ఒక చింతబరికె చేత పుచ్చుకు, యింటివైపుగా తోలడం మొదలుపెట్టింది. ఆవుకి కూడా యిటూ అటూ పారిపోవాలనిలేదు. సెల్వియాని ఆడిం చేందుకు ఆ పనిచేసింది. బాటమీదకి రాగానే పెద్దపెద్ద అంగలు వేసుకుంటూ ముందుకుసాగింది.

ఇంత ఆలస్యమయినందుకు అమ్మమ్మ ఏమంటుందోనని సెల్వియాకి మనసులో దుడుకుగానేఉంది. పొద్దున్న అయిదు న్నరకి యింటిదగ్గర బయలుదేరింది. గొడ్డుని యింటికి తోలుకు రావడంలోని సాధకబాధకాలు అమ్మమ్మకి తెలియనివికాదు; యిప్పుడంటే ఈ మనమరాలువుందిగాని, వెనకటిరోజులలో మిసెస్ టిల్లీయే ఆవుని తోలుకెళ్తూండేది. చిన్నతనంకొద్దీ సెల్వియా యిటూ అటూ తిరుగుతూండే స్వభావంగలది అయినప్పటికీ, అలాటివి చూసీ చూడకుండా వూరుకోవాలి; పట్నంలో ఎనిమి దేళ్లువుండివచ్చిన అమ్మాయికి, ప్రకృతికి సన్నిహితమైన ఈజీవితం ఎంతోమేలు చేస్తుంది అని అనుకునేది మిసెస్‌టిల్లీ.

సెల్వియాకి మనుషులంటే భయమట. మిసెస్‌టిల్లీకి సెల్వియాతల్లి (అంటే మిసెస్‌టిల్లీకూతురు) వాళ్లూ చెప్పారా సంగతి. 'మా తోటలో మనుషులు కనుపించరులే!' అని తీసు కొచ్చించి సెల్వియాని. అమ్మమ్మగారింట్లో, అమ్మమ్మా తనూ

ఒక పిల్లిపిల్లా, రెండు గాబిన్‌పక్షులూ తప్ప యింకేమీ లేవు. సెల్వియాకి ఈ వాతావరణం ఎంతో బావుంది; ఎప్పుడూ యిక్కడే వుండిపోవడానికి నిశ్చయించుకుంది.

ఆవూ, అమ్మాయీ ఒకరివెంట ఒకరు నడుస్తున్నారు. ఆవుకి అది మామూలు నడక అయినప్పటికీ, అమ్మాయి పరుగుపరుగున నడుస్తోంది. పిల్లకాలవ కనిపించేటప్పటికి, ఆవు నీరు తాగేందుకు ఆగింది; ఆవు నీళ్లు తాగుతూంటే, అమ్మాయి నీళ్లలో కాళ్లు పెట్టుకు నుంచుంది. సంజెవేళ ఎగిరే పురుగులు ఒక్కసారి జుయ్‌మని లేచాయి. ఆవూ అమ్మాయీ మళ్లీ బాటమీదికి వచ్చారు. పొదల మీదనున్న పక్షులు కిలకిల్లాడేటప్పటికీ, సెల్వియాకి ఎంతో ఆనందమయింది. ఆమెకేదో నిద్రమగతవచ్చినట్టయింది, గాలి పల్చగానూ పరిమళ భరితంగానూ ఉంది; తనెప్పుడూ ఈ అడవిలో యింత ఆలస్యమయేదాకా వుండిఎరగదు. తను యిక్కడికివచ్చి ఏడాది అయింది; పట్నంలోని రొద అలాగే ఉండి వుంటుంది; పట్నంలో తనని ఏడిపించే ఎర్రఅబ్బాయి మొహం జ్ఞాపకం రాగానే, తొందరతొందరగా యిల్లు చేరుకోవాలనిపించింది సెల్వియాకి.

ఇంతలో ఎక్కడనుంచో ఒక ఈలపాట వినిపించేటప్పటికి, ఆ అమ్మాయి నవనాడులూ కుంగిపోయాయి. ఆ ఈల పక్షిది కాదు; పక్షులు తన స్నేహితురాళ్లే! అది ఎవరో అబ్బాయి వేస్తున్న ఈల. ఆవుని దాని ఖర్మానికి దాన్ని వొదిలేసి, పక్కగా ఉన్న పొదలచాటుకి పోయింది సెల్వియా. కాని, అప్పటికప్పుడే

కాలాతీతమయింది. శత్రువు ఆ అమ్మాయిని చూశాడు. ఎంతో ఉత్సాహంగా, "అమ్మాయ్, రోడ్డు యిక్కడికి ఎంతదూరం?" అని అడిగాడు.

"చాలాదూరం," అంది సెల్వియా. ఆ మాటలు గొంతుకలోనే పూడుకుపోయాయి.

బుజాన తుపాకీ వేసుకు నడుస్తున్న, ఆ పొడుగాటి యువకుని వంక సెల్వియా చూడలేకపోయింది. భయంతో గడగడలాడుతున్న ఆ పిల్ల, పొదల చాటునుంచి బాటమీదికి వచ్చి, ఆవుని అనుసరించింది; అతను ఆ అమ్మాయిని అనుసరించాడు.

"నేను పిట్టల్ని వేటాడుతూ, దారి తప్పాను. నువ్వు కనిపించడం నాకెంతో సంతోషంగా ఉంది. అనవసరంగా భయపడకు. నీపేరేమిటో చెప్పు; ఈ రాత్రికి నేను మీ యింటిదగ్గిర ఉండవచ్చా? తెల్లారి లేవగానే వెళ్లిపోతాను," అంటూ ఆ వ్యక్తి నెమ్మదిగా అన్నాడు.

సెల్వియా యింకా భయపడింది. ఈ కొత్తమనిషిని వెంట బుచ్చుకు తనువెళ్తే అమ్మమ్మ ఏమంటుందో? ఏందారి, భగవంతుడా! యిందులో తన తప్పేమీ లేదు. తలవంచుకొని "సెల్వియా" అని, అతి కష్టంమీద, తనపేరు చెప్పింది.

ఆవూ, అమ్మాయీ, కొత్త వ్యక్తీ రావడం మిసెస్ టిల్లీ (అమ్మమ్మ) గుమ్మంలో నుంచుని చూసింది. ఆవు ఒక్కసారి అంబా అని అరిచింది.

"సెల్వియా, ఏం జరిగింది? ఆవు ఎక్కడైనా దారి తప్పిందా?" అని అడిగింది అమ్మమ్మ. సెల్వియా పెదవి మెదపక నుంచుంది; అమ్మమ్మకి తన అవస్థ అర్థమవు తున్నట్టు లేదు. ఆ వచ్చిన కొత్తతను చుట్టుపక్కల పొలాల్లోని అబ్బాయి అను కుంటున్నట్టు వుంది.

తుపాకీ చేత బుచ్చుకున్న యువకుడు, బుజంమీాదసంచీ కింద పడేసి, మిసెస్ టీల్లీకి వందన మర్పించి, తన బాటసారి కథ చెప్పి, ఆ రాత్రికి తను తలదాచుకునేందుకు స్థలమీాయమని అర్థించాడు.

"ఈ రాత్రికి యిక్కడవుండి, తెల్లారగానే వెళ్లిపోతాను; నేను చాలా ఆకలితో ఉన్నాను; పాలు దాహంగా యిచ్చినా చాలు," అన్నాడతను.

"రోడ్డు యిక్కడికి ఒకమైలు దూరం ఉంటుంది. ఈ పూటకి నువ్వు మాకున్న దానిలో మాతోపాటు తినవచ్చు. సెల్వియా, లోపలికి వెళ్ళి పళ్లాలు పెట్టు," అంది పెద్దావిడ. ప్రతిష్టంభన తగ్గినందుకు సెల్వియా ప్రాణం కుదుట పడింది; తనకి కూడా బాగా ఆకలవుతోంది. అంచేత, గబగబా పళ్ళాలు పెట్టింది.

న్యూయింగ్లండు మహారణ్యంలో యింత పరిశుభ్రమైన యిళ్ళు వున్నాయా అని, ఆ యువకుడు ఆశ్చర్యపోయాడు. ఇల్లు చూపులకి పాతదైనప్పటికీ లోపల చక్కగా ఉంది. భోజనాల టేబుల్ దగ్గిర పెద్దావిడ ఖబుర్లు వింటూ, చిన్నపిల్ల కళ్ళకాంతులు అదేపనిగా చూస్తున్నాడా యువకుడు. "సెల్లాల్లీ మధ్య యింత

కష్మాటి భోజనం చేయలేదంటే నమ్మండి," అన్నాడతను మిసెస్ టిల్లీతో. భోజనాలై వీధి గుమ్మంలోకి వచ్చేవేళకి చంద్రోదయమయింది.

బెర్రీకాయల సీజను యింకెన్నాళ్ళో లేదు; కాయలు కోయడంలో సెల్వియా ఎంతగానో సాయపడుతుంది; అప్పుడప్పుడు దారి తప్పేందుకు ప్రయత్నించినా, తమ ఆవు ఎంతో మంచిది; తమకి సరిపడ్డన్ని పాలు యిస్తుంది; సెల్వియా తల్లి గురించీ, తన కొడుకు గురించీ, ఆరుగురు తన కడుపున పుడితే యిద్దరు మాత్రమే మిగిలిన సంగతీ; యిలా తమ మంచిచెడ్డలు ఆ కొత్తతనితో ప్రస్తావించ సాగింది మిసెస్ టిల్లీ.

"మా అబ్బాయి కూడా, నీకు మల్లేనే, తుపాకీ బుజాన వేసుకు వెళ్ళేవాడు. తుపాకీ కాల్చడమంటే వాడికి మహాసరదా. ఎక్కడున్నాడో యేమో! ఒక్క ఉత్తరముక్క కూడా రాసి ఎరగడు. వాడినని లాభమేమిటి, ఈ రోజుల మహాత్యం," అంది పెద్దావిడ.

"ఈ సెల్వియా వాడి పోలికే. అడవికి పోతే దానికి యింటి ధ్యాసే ఉండదు. అక్కడి పక్షులతో ఆడుకుంటుంది. ఉడతల్ని మచ్చిక చేసుకుంటుంది; అది అన్నం తింటున్నప్పుడు ఒక కంటితో కనిపెట్టకపోతినా, ఆ తినేది కాస్తా వీటికీ వాటికీ వేస్తుంది. వేటి కన్నా వెయ్యిగాని, కాకులకి మాత్రం వేయవద్దంటాను. మా అబ్బాయి, దేశాల వెంబడి పోవడానికి పూర్వం, ఒక కాకిని కూడా పెంచేవాడు. వింటున్నావా నాయనా, కాకిని పెంచేవాడు."

అతిథి ఆ మాటలు వింటున్నాడే గాని మనసు ఎక్కడో ఉంది. "సెల్వియాకి పక్షుల గురించి బాగా తెలును నన్నమాట," అన్నాడతను. చంద్ర కాంతిలో కూచున్న సెల్వియా కనురెప్పల మీదకి నిద్రమత్తు వస్తోంది. "చిన్నతనం నుంచీ పక్షుల్ని పెంచడం నాకు సరదా. నాదగ్గిర రకరకాల పక్షులున్నాయి. గత అయిదేళ్ళుగా రెండువందల రకాల పక్షులకోసం నేను మహా వెతుకుతున్నాను. అవిదొరికేదాకా నా ప్రయత్నం విరమించుకోకూడదని పట్టుదలగా వెతుకుతున్నాను," అన్నాడతను.

"ఈ పక్షులన్నిటినీ పంజరాలలో పెట్టి వుంచుతావా, నాయనా?"

"ఎబ్బే, వాటిని 'స్టఫ్' చేసి, పదిలపరుస్తాను. నాదగ్గిర ఎన్ని డజనులు వున్నాయో చెప్పలేను. అన్నీ నేను పట్టుకున్నవే! మర్యాదగా వలలో పడితే సరేసరి, లేకపోతే కాల్చి బుట్టలో వేసుకుంటాను. మొన్న శనివారం, యిక్కడికి కొద్ది మైళ్ళ దూరంలోనే, నాకు నారాయణ పక్షి (హెరాన్) కనిపించింది. అది ఏవైపుగా ఎగిరిందో ఆనవాలు చూసుకుంటూ యిలా వచ్చాను. ఈ ప్రాంతంలో నారాయణపక్షులున్నట్టు ఎవరికీ తెలియదు. ఆ తెల్లటి నారాయణపక్షి యిక్కడికి ఎలా వచ్చిందీ అని?" అంటూ సెల్వియా వంక చూశాడతను,; సెల్వియాకి ఆ విషయమేమైనా తెలుసునేమో నన్నట్టు.!

కాని, సెల్వియా తన కాళ్ళదగ్గిర గెంతుతున్న కప్పని పరిశీలిస్తోంది.

"నారాయణపక్షి ఫలానా అని చూసీ చూడగానే గుర్తు పట్టవచ్చు. పట్టుకుచ్చులాంటి ఈకతో, సన్నగావుండే కాళ్ళతో, పొడుపుగా కనిపించే ఈ పక్షిని గుర్తుపట్టడం చాలా తేలిక. చెట్ల పై భాగాన, చిన్నచిన్న పుల్లలతో, డేగకి మల్లే గూడు కట్టు కుంటుంది," అన్నాడా యువకుడు.

సెల్వియా హృదయం నెర్రి ఆనందంతో కుప్పిగంతులు వేసింది; ఆ తెల్లపక్షి తనకి తెలుసు; ఒకసారి తనకి దగ్గిరసావచ్చి నుంచుంది. పసరిక బయలుకి పైగా, అడవికి ఆవలితట్టు నుంచి వచ్చిందా పక్షి. అటువైపుగా వెళ్తే బురదలో కూరుకుపోతావని అమ్మమ్మ చాలా సార్లు చెప్పింది; అంచేత తనెప్పుడూ ఆ చాయ లకి పోలేదు. ఆ బురదకీ, ఆ కనిపించే చెట్లపొదకీ పైగా, సముద్రం ఉందట. తుపాను రాత్రులప్పుడు, చెట్ల సందుల్లోనుంచి చీల్చుకువచ్చే సముద్రపు హోరువినడమే గాని, తను సముద్రాన్ని ఎప్పుడూ చూడలేదు.

"ఆ నారాయణపక్షి గూడు ఎక్కడో తెలుసుకునేందుకు, నేను తాపత్రయ పడుతున్నా, అది చూపించిన వారికి పదిడాలర్లు యిస్తాను. ఈ పక్షి మరొకచోటికి వలసపోతోందా, లేక ఏదైనా దుష్టపక్షి బారినుంచి తప్పించు కునేందుకు పారిపోతోందా? ఆ సంగతి తెలుసుకోవాలి."

మిసెస్ టిల్లీకి ఈ మాటలు వింతగా ఉన్నాయి; సెల్వియా తన కాళ్ళముందు ఆడుకునే కప్పనే చూస్తోంది. ఆ పక్షిగూడు చూపించిన వారికి పదిడాలర్లా? డబ్బు అంత విలువలేనిదా!

మర్నాడు సెల్వియా, ఆ యువకుడూ అడవి వెంటపడి పోయారు. సెల్వియాకి నిన్నటిభయం పోయింది. అతను చాలా మంచివాడిలా కనిపించాడు. పక్షిజాతులూ వాటి మంచిచెడ్డలూ, వాటి జీవన పద్ధతులూ మొదలైనవి ఆ అమ్మాయికి వివరించి చెప్పడం మొదలెట్టాడు. అతను ఆ అమ్మాయికి ఒక మడతకత్తి (పెద్ద చాకు) బహుమానంగా యిచ్చేటప్పటికి, ఆ బహుమతి చూసుకు ఆ అమ్మాయి మురిసిపోయింది. పొద్దస్తమానం ఆ అమ్మాయి భయపడలేదు గాని చెట్టుకొమ్మమీద నున్న ఒక సంగీతపు పిట్టని అతను నేల కూల్చే వేళకి, ఆమె కొద్దిగా జడుసుకుంది. అతని దగ్గిర తుపాకీ లేకుండా వుంటే బావుండుననుకుంది. అంత యిష్టమని చెబుతూనే, ఆ పక్షులని అతను ఎందుకలా చంపుతాడో, ఆమెకి అర్థంకాలేదు. ఆ యువకుడు బావున్నాడు; రూపసి; అంత అందమైన మనిషిని తనింతవరకూ చూడలేదు. ఆ అమ్మాయి అంతర్యంలోని ప్రేమస్వప్నాలు కొంచెం కదిలాయి. ఈ అడవిలోకి ఒక వేటకాడు వచ్చాడని ఆ పిట్టలకి తెలుసు కాబోలు; అందుకనే అవి దూర దూరంగా పోసాగాయి. ఒకానొక పక్షిగానం విని, కొమ్మలూ రెమ్మలూ తప్పించుకుంటూ, వారు దాని దగ్గిరకి వెళ్ళబోయే టప్పటికి, అది కాస్తా తుర్రుమంది. సెల్వియా ఆ యువకుని వెంట తను నడిచిందిగాని, తనంతట తాను దారి తీయడానికి పూనుకోలేదు. ఆమె ముందు నడవక పోవడం వల్లనే నారాయణపక్షి కనిపించి వుండదు. సాయంత్రమయ్యాక, యిద్దరూ ఆవుని వెంటబెట్టుకు, యింటివైపుగా నడక సాగించారు. ఇరవై నాలుగు గంటలక్రితం, ఏ ప్రదేశంలో ఉండగా తలపాటు

విని తుళ్లి పడిందో, ఆ చోటుకి తాము ముగ్గురూ రాగానే, సెల్వియా చిరునవ్వు నవ్వింది.

# 2

ఇంటికి అరమైలు దూరంలో ఒక గుట్ట వుంది; ఆ గుట్ట మీద ఒక దేవదారుచెట్టు వుంది. ఆ దేవదారుచెట్టు ఎన్నాళ్ళ బట్టో అక్కడ ఉంది; సరిహద్దు నిర్ణయానికి గాను దాన్ని అలా మిగిల్చేశారేమో తెలీదు; ఎంచేతనంటే ఆ వృక్షానికి సమకాలికంగా వున్న వన్నీ చనిపోనన్నా చనిపోయాయి, లేదా కట్టెలవాళ్లు కొట్టెయ్యనన్నా కొట్టేశారు. కాని, ఈ వృద్ధ దేవదారు ఏదో కాపలా కాస్తున్నట్టుగా అక్కడ నిలబడి వుంది. సెల్వియాకి ఆ దేవదారు గురించి బాగా తెలుసు. ఆ చెట్టు చిటారికొమ్మ మీద నుంచుంటే సముద్రం కనిపిస్తుందని, చాలామంది చెప్పగా, తాను ఎన్నోసార్లు వింది. సూర్యోదయం వేళకి తను ఆ చెట్టు చిటారి కొమ్మమీద వుండగలిగితే, నారాయణపక్షి గూడు ఎక్కడవున్నదీ యిట్టే తెలుసుకు, తన స్నేహితుడికి చెప్పవచ్చు. ఆ చెట్టు కొనమీద నుంచి ప్రపంచమంతా కనిపిస్తుంది.

ఏమి సాహసం! ఎటువంటి వెర్రికోరిక!! మర్నాటి ఉదయానికి తెలియనున్న రహస్యం, ఆ చిన్నిహృదయం మోయలేనంత బరువుది అయింది.

యువకుడూ, పెద్దావిడ నిద్దరపోయారు గాని, సెల్వియా కంటిమీదకి కునుకు రావటంలేదు. సాధించనున్న ఘనకార్యం

ఆ అమ్మాయిని నిద్రకి దూరం చేసింది. కళ్ళు మూసుకుంటే నిద్ర రొస్తుందేమో; నిద్దరొస్తే, తెల్లారేదాకా మెలకువ రాకపోవచ్చు. సూర్యోదయానికి పూర్వమే, తను దేవదారు వృక్షపు చివరి కొమ్మమీద ఉండాలి. ఆమె చిన్ని జీవితంలో నవ వసంతం తొణికిస లాడింది.

సన్నటి చంద్రకాంతిలో ఆ పెద్దదేవదారువృక్షం నిద్ర మునిగివుండగా, సెల్వియా చిన్నిదేహంలో రక్తం చకచకా పరుగులెత్తుతోంది. దేవదారుకి పక్కగావున్న సిందూరపుచెట్టు ఎక్కి, దానిమీదుగా దేవదారుమీదకి పాకాలి. ఆప్రకారమే సెల్వియా సిందూరపుచెట్టు ఎక్కింది మొదట. ఎంతయినా, ఆమె లేతవేళ్లూ, లేతపాదాలూ ఆ ఎక్కుతున్నప్పుడు గీరుకు పో సాగాయి. తమ నిశ్శబ్దాన్ని భంగపరుస్తున్నదెవరా అని, ఒక ఉడత యిటునుంచి అటు దూకింది; గూటిలోవున్నపక్షి బయటి కొచ్చి ఈ వింత చూసింది; చెట్లఆకులు మంచుబొట్లతో బరు వుగా ఉన్నాయి. చెట్లు ఎక్కడం సెల్వియాకి ఏమంతకష్టంకాదు; ఆమెకి చెట్లుఎక్కడం అనుభవమే ! గబగబా సిందూరపుచెట్టు చివరికొమ్మలదాకా ఎక్కింది; అక్కడనుంచి జాగ్రత్తగా దేవ దారువృక్షంకొమ్మలు అందుకుంది.

ఈ చెట్టుమీదనుంచి ఆ చెట్టుమీదికి వెళ్లడం మాటలు కాదు; తను అనుకున్నదానికంటె చాలాకష్టంగాఉంది. ప్రాణాలు బిగబట్టి, ధైర్యంచేసి, అతినేర్పుగా రెండుచేతులా దేవదారు కొమ్మ అందుకు, ఒక్క ఊగు ఊగింది. చేతుల్లో శక్తీ, గుండెల్లో ధైర్యమూ ఉండటంవల్లగాని లేకపోతే ఏమైపోయేదో ! మెల్లి

మెల్లిగా ఆ కొమ్మనుంచి ఆ కొమ్మమీదుగా పైకిపాగింది. సూర్యోదయ సమయమైందని చెప్పేందుకు గూళ్లలోని పక్షులు కిచకిచలాడాయి. కాంతిరేఖ కనిపించేలోగా తను చిటారు కొమ్మ చేరుకోవాలి.

ఎంత ఎక్కినా, చెట్టు యింకా ఎత్తుగా ఉన్నట్టే ఉంది. బ్రహ్మాండమైన తెరచాప కొయ్యలా ఉంది. ఎంతసేపుఎక్కినా, తరగడంలేదు. ఆ చెట్టులో గ్రల్లో నివసించే పక్షిసంతానంచేసే కలకల నినాదాలకంటె, ఈ చిన్నారి ఏకాంతహృదయసంగీతం ఎక్కువమధురంగా ఉంది. ఒకవంక పక్షులరొద; మరొకవంక ఆ అమ్మాయి గుండెలదడ. తూర్పుదిశ ఎర్రనవుతోంది.

సెల్వియా ముఖపద్మం క్షణకాలంపాటు వాడిన నక్షత్రంలా అయిందిగాని మళ్లా యింతలో వికశించింది. ఆ కొమ్మలు కొద్దిగా నెట్టి చూసేటప్పటికి, దూరాన సముద్రమగుపడింది. బాలభానుని కిరణాలతో సముద్రం బంగారువన్నె దాలుస్తోంది; తూర్పు దిక్కుగా పెద్దపక్షులు ఎగురుతున్నాయి. చెట్టుకొమ్మమీదనున్న సెల్వియా, తనుకూడా ఆ విధంగా ఎగరగలనని భావించింది. పడమటివైపుకి తలతిప్పగానే చర్చిశిఖరాలూ, పల్లెలూ, మిగతా ప్రపంచమూ కనిపించిందామెకి.

పక్షులపాటలు పెద్దవయాయి; సూర్యబింబం ధగధగ లాడింది. దూరాన, సముద్రంలోని ఓడల తెరచాపలు, కనిపించాయి. తెల్లటి నారాయణపక్షొకటి, ఆకుపచ్చని కొమ్మలలో నుంచి, సముద్రంవైపుగా ఎగిరింది. హమ్మయ్య! ఈ పక్షిని చూసేందుకూ, దానిరహస్యం తెలుసుకునేందుకూ కదా తను

యింత ఎత్తు ఎక్కింది! నారాయణపక్షులు ఎక్కడనుంచివస్తు న్నదీ, సెల్వియా కూ కళ్లు పెద్దవిచేసుకు చూసింది. ఆ రెక్కలఅందం, ఆ మెరసొగసు, ఆచక్కనిముక్కూ—మాటలు చాలవు దానిని వర్ణించేందుకు! తనకి దగ్గిరిలోనే, దేవదారువృక్షపుకొమ్మమీద నిలబడి, తన నేస్తాన్ని లేపుతోంది నారాయణపక్షి! "నవ్య శోభలతో నూతనోదయమయింది; నిద్రమేలుకో, నేస్తమా" అంటోంది ఆ పక్షి.

మిగతా పిట్టల అరుపులు ఎక్కువయేటప్పటికి, నారాయణపక్షి అక్కడ్నుంచి వెళ్లిపోయింది; సెల్వియాకి అది ఎక్కడ వుంటుందో, దాని రహస్యం తెలిసిపోయింది. అంత ఎత్తునుంచి కిందికిచూస్తే కళ్లు తిరుగుతాయని, కిందికిచూడకుండా, ఒక్కొక్క కొమ్మే దిగుతూవచ్చింది. కాళ్లురెండూ గీరుకుపోయి రక్తంకారుతోంది. అతి జాగ్రత్తగా దిగింది సెల్వియా. నారాయణపక్షి ఎక్కడఉండేదీ తను చెప్పేటప్పటి, ఆ కొత్తతను ఎంత సంతోషిస్తాడో!

*  *

"సెల్వియా! సెల్వియా!!" అమ్మమ్మఎంత అరిచినా సెల్వియా కనబడలేదు; పక్కమీద లేదు.

అతిథి నిద్రనుంచి లేచాడు. ఈ రోజైనా తనకి నారాయణపక్షి దర్శనం కాకపోతుందా అని అతని ఆశ! సెల్వియాకి ఆ పక్షిగురించి తెలిసినట్టుంది; ఆ అమ్మాయి పూనుకుంటే, యివ్వాళ తనకార్యం నెరవేరుతుంది — అనుకున్నాడతను. వొళ్లంతా గీసుకుపోయి, చినిగినబట్టలతో ప్రత్యక్షమయింది

సెల్వియా వీధిగుమ్మంలో. అమ్మమ్మా, అతిథీ యిద్దరూ, "ఎక్కడికెళ్లావ్" అని ఆ అమ్మాయిని ప్రశ్నించేందుకు, గుమ్మా నికి అడ్డంగా నుంచున్నారు. ఫలానా హెమ్లాక్ చెట్టుమీద నారాయణపక్షి ఉంటుందని చెప్పవలసిన సువర్ణఘడియ, సెల్వియా జీవితంలో ఆసన్నమయింది.

కాని, సెల్వియా మాట్లాడలేదు; అమ్మమ్మ తిట్టినా మాట్లాడలేదు; అతిథి ఎంతో జాలిగా కరుణతో అడిగినా మాట్లాడలేదు. అతిథి కళ్లలోకిచూసింది సెల్వియా. అతను పది డాలర్లు యిస్తానన్నాడు; ఆ పదిడాలర్లూ తమకెంతగానో పని కొస్తాయి. భాగ్యశాలిఅయిన అ అతిథి, తమని ఎన్నోవిధాల సంతోషపెట్టగలడు!

కాని, సెల్వియా తనకి తెలిసినరహస్యం చెప్పదలుచుకో లేదు. తను ఎందుకు చెప్పలేకపోతోందో ఆమెకే సరిగా అర్థం కాలేదు. నారాయణపక్షి ఎక్కడ ఉంటుందో చెబితే, ఈ మనిషి దానిప్రాణాలు తీయకమానడు. తనమూలంగా అంత చక్కటి పక్షి—నవ్యశోభలతో నూతనోదయమయింది; నిద్రమేలుకో, నేస్తమా—అనేపక్షి, చావడమేమిటి? అంత పాపపుపని తను చెయ్యదు.

అతిథివెళ్లిపోయాడు; అతనివెంట వెళ్లవలసిన తను మిగిలి పోయింది. ఆవుని తోలుకు యింటికివస్తూండగా, అప్పుడప్పు డామెకి ఈలపాట వినిపించేది. ఏదో పోగొట్టుకున్నట్టు బాధగా ఉండేది; కాని, తుపాకీచప్పుడు వినగానే, తనేమీ పోగొట్టుకో

లేదనీ, పిట్టలే ఆత్మీయమైనవనీ అనిపించేది. నిజానికి, ఈ పక్షులు ఆ వేటకానికంటె సన్నిహితమైనవా — ఏమో ఎవరు చెప్ప గలరు? ధనధాన్యాలు లేని ఏకాకిని కావచ్చు ఆ అమ్మాయి; కాని, ఆమె హృదయంలో ప్రేమసాగరం ఉంది.

# పదిహేడేళ్ల స్నేహం

## జాక్ లండన్

## (1876–1916)

జాక్ లండన్ కాలిఫోర్నియా రాష్ట్రంలోని ఓక్‌లాండ్‌లో జన్మించాడు. ఈయన రచనలకంటె ఈయన జీవితమే అసాధారణమైనది. ఇది స్వానుభవమే అయియుండవచ్చు; ఏదిరాసినా, ఆత్మకథ రాస్తున్నట్టుగానే రాసేవాడు. చిన్నతనంలో అనుభవించిన దారిద్ర్యకష్టాలవల్ల యౌవ్వనపు ప్రథమదశలోని దారుణ కష్టాలవల్ల అతని సానుభూతి యెప్పుడూ దీనజనులమీద ఉండేది. దీనులనీ దిక్కులేని వారినీ వెనకేసుకొచ్చి, వారితరఫు న్యాయవాదిలా వాదించేవాడు.

ప్రకృతిశక్తులకంటె మనిషి మనిషికిచేస్తున్న అపచార మెక్కువ — అంటాడు. జంతువులు ప్రవర్తించినట్టే మనుషులూ ప్రవర్తిస్తారు; ఏమంత తేడాలేదు — అంటాడు జాక్ లండన్. ఈయన రాసిన పుస్తకాలలో 'ది కాల్ ఆఫ్ ది వైల్డ్' ప్రత్యేకంగా పేర్కొనదగినది.

# పదిహేడేళ్ల స్నేహం

నే నతనిని మొట్టమొదట ఒక పెద్దతుపానులో కలుసుకున్నాను; మేమిద్దరం ఒకే స్కూనర్ (చిన్న ఓడ)లో ప్రయాణం చేస్తున్నా, ఆ స్కూనర్ ముక్కలై సముద్రంలో కలిశాకగాని, నే నతనిమొహం చూడలేదు. పడవమీాదఉన్నప్పుడు నేనతన్ని చూసినగుర్తులేదు; ఎంచేతనంటే పెటైట్ జన్నిలో (ఆ స్కూనర్ పేరు) మనుషులు క్రిక్కిరిసిఉన్నారు. ఆబోటుకిచెందిన నావికుల మాట అటుంచి, ఆరుగురు కాబిన్‌పాసింజర్లూ, ఎనభై అయిదుగురు డెక్‌పాసింజర్లూ ఉన్నారు. అందరూ రాన్‌గిరోనుంచి వస్తున్నవారే!

ముత్యాలు ఏరే కాలము అయిపోయింది; అందరూ టాహిటిదీవులకు వస్తున్నారు. కాబిన్‌లోఉన్న మేము ఆరుగురం ముత్యాలుకొనేవాళ్లం — అనగా ముత్యాలవర్తకులం. ఇద్దరు అమెరికనులూ, ఒకచైనాదేశనుడూ, ఒకజర్మనూ, ఒకపోలిష్ జ్యూ—ఆరోవాణ్ణి నేను!

ఆ ఏడు అందరికీ లాభంగానే ఉంది. ఇటు అమ్మేవారికి, అటు కొనేవారికి అందరికీ పుష్కలంగా గిట్టుబాటుఅయింది. ఎవ్వరికీ చింతాచీకూ లేదు.

పెటైట్‌జెన్నీ బాగా ఓవర్‌లోడ్ అయివుంది. డెబ్భయి టన్నుల స్కూనర్‌మాత్రమే అది! ప్రస్తుతం బోటులోఉన్న వారిలో పదోవంతునికూడా తీసుకువెళ్లడానికి వీలులేదు దానికి!

ఇక దానిలోవున్న సరుకు సంగతి చెప్పనే అక్కర్లేదు—ముత్యాల కురిడీలతో ముత్యాలగుల్లలతో పూటుగా ఉంది పడవ. ఎక్కడి కక్కడ సరుకుతో నిండిపోయిన ఈ స్కూనర్‌ని, నావికులు ఎలా నడపగలుగుతున్నారో ఆశ్చర్యమే! డెక్ మీదనున్న మనుషుల స్థితి వేరేచెప్పాలా, కదలడానికి సందులేదు.

ఆగ్నేయపవనాలు బాగావుంటే, రెండుమూడురోజులలో ఈ పడవ రేవు చేరుకుంటుంది. మేము ఐదు గంటలు ప్రయాణం చేసేటప్పటికి, వున్న కాస్తగాలీ మాయమయింది. భరింపరానంత ఉక్క; కళ్లుతెరిస్తే తలనొప్పి.

రెండోరోజున ప్రయాణీకులలో ఒకతను మశూచికం పోసి చనిపోయాడు; ఆ చనిపోయినతను ముత్యాల 'డైవర్'గా పేరుపడ్డవాడు. రాన్‌గిరోలో మేము బయలుదేరేటప్పటికి మశూచికం మాట ఎక్కడాలేదు; మరి, ఎలావచ్చిందో! అతను చని పోయాడు; మరోముగ్గురు పక్కవేశారు.

జబ్బుగావున్నవారిని వేరుగా ఉంచే స్థలమెక్కడ? యిద్దరు నావికులూ, పోలిష్‌జ్యూ, మరోనలుగురు నేటివ్‌లూ, చేపలుపట్టే పడవవుచ్చుకు, (Whaleboat), ఆ రోజురాత్రి చల్లగా సముద్రం లోకి జారుకున్నారు. వారేమయారో తెలీదు. తెల్లారేక ఈ సంగతి తెలుసుకున్న కెప్టెన్, మా స్కూనర్‌కి తగిలించిఉన్న మిగతాపడవలన్నీ ముంచెయ్యమన్నాడు.

ఆ రోజు ఇద్దరు చనిపోయారు. ఆ తర్వాత ముగ్గురు; నాలుగోరోజున ఎనిమిదిమంది చచ్చారు. నేటివ్‌లు భయా

త్పాతంతో గడగడ లాడుతున్నారు; మేము కడుపునిండా స్కాచ్ విస్కీ తాగి ఆ ప్రమాదం అక్కడ లేనట్టుగా సంచరించ బోయాం. నిరంతరం మత్తులో ఉంటే, విషక్రిములు మనదగ్గిరికి రావనే సిద్ధాంతం లేవదీశాం. స్కూనర్ కెప్టెన్ ఒక ఫ్రెంచి మాన్; అతను మాతో తాగకపోయినా, మా సిద్ధాంతం మట్టుకు ఆమోదించాడు. చైనా దేశీయుడు రోజుకి ఒకగ్లాసు చాలు - అన్నాడు.

మాకు ఉత్తరంగా, కొంచెం నడినెత్తిన ఉన్నాడు సూర్యుడు. అప్పుడప్పుడు ఈదురుగాలి (వానతో కూడా) కొట్టడంతప్ప మామూలుగాలిలేదు; ఆ ఈదురుగాలి అయిదునిము షాలనుంచి అరగంటదాకా కొట్టేది. వర్షం మమ్మల్ని బాగా తడిపేశాక, సూర్యుడు మబ్బులచాటునుంచి పైకివచ్చి, తడిసిన వస్తువుల్ని పిండిస్తూ, వింతపొగలు తెప్పించేవాడు. ఆ పొగ లేమిటో చెప్పలేను; అవి చూసినకొద్దీ భయమేసేది; భయం పోయేందుకు కడుపునిండా తాగేవాళ్లం.

ఇలా ఒకవారం గడిచింది. మా దగ్గిరవున్న విస్కీ అయి పోయిందిగాని రేవుదగ్గరపడలేదు. స్కూనర్లోని బారోమీటర్ 29.62 చూపించేటప్పటికి, యిదేమిటని కెప్టెన్ని అడిగాను. (29.90 నార్మల్; 29.85 నుంచి 30.00 దాకా, కాకపోతే 30.05 దాకా చూపవచ్చు). కొన్ని గంటలనుంచీ బారో మీటర్ పడిపోతోందనీ, పెద్దపెద్దగాలులు రావచ్చుననీ, వాటిని ఎదుర్కొనేందుకు తగు సన్నాహాలు చేస్తున్నాననీ కెప్టెన్ అన్నాడు. బారోమీటర్ పడిపోతే దక్కు గాగాక మరో

వైపుగా వెళ్తే, తుపానుగాలి మధ్యకివెళ్లి యిరుక్కోవడానికి బదులు, ఆ ఉధృతానికి కొంచెం దూరంలో ఉంటామని నాకు తోచినసలహా చెప్పాను. కెప్టెన్‌కంటె నాకెక్కువ తెలుసునా?— అని అనుకొని వుంటారు మిగతావారు; అందుకనే నామాటలు పాటించలేదు ఎవరూ.

సముద్రంలో కెరటాలు లేచాయి; గాలీలేచింది. పైలెట్ జిన్నీలోకి సముద్రపు నీరు వచ్చిపడింది. స్త్రీపురుషులూ, పిల్లలూ, చేతనా చేతనాలూ అన్నీ ఒక్కసారి పెద్ద పెట్టున అరిచాయి. స్కూనర్ లోకి నీరు వచ్చిందన్నమాటేగాని, అది మునిగిపోలేదు — తేలే వుంది.

రెండోసారి నీరు వచ్చినప్పుడు పడవ వెనకభాగం నీటిలో మునగడంతో, మనుష్యులందరూ ఆక్రందనచేస్తూ తలకిందులుగా పడ్డారు. అది జనప్రవాహం; ముందు తల, ఆపైన కాళ్లు. అక్కడక్కడ ఎవరైనా, చేతికందినది పట్టుకు వేలాడబోయినా, తమ బరువే తమని కిందికితోసేది. ఒకడి తలకాయ కోడిగుడ్డులా పగలడం చూశాను.

రానున్న ప్రమాదం తెలుసుకు, తెరచాప కర్రవైపు నేనొక్క దూకు దూకాను. చైనాదేశీయుడూ అమెరికనులూ నా వెనక వస్తున్నారు. నేను వారికంటె ఒక్క అడుగు ముందు వేయగలిగాను — అంతేతేడా! ఇద్దరు అమెరికనులలో ఒకతను పిప్పి పిప్పి అవడం కనిపించింది. చైనీయుడు ఒకచక్రం అసరాగా పుచ్చుకునివుండగా, లావుపాటి స్త్రీ ఒకామె అతని మెడచుట్టూ చేతులు వేయడంతో, అతను ఒక నావికునిమీద అనుకున్నాడు.

సరిగా అదేవేళప్పుడు, పడవ కుడివైపుకి బోల్తాకొట్టింది. ఆ చైనీయుడూ, ఆస్త్రీ, ఆ నావికుడూ ముగ్గురూ దబ దబ జారిపోయారు.

మూడోసారి నీరు వచ్చేటప్పటికి, సుమారు ఒక డజను మందిదాకా, సగం మునిగిన 'డెక్' మీద ఉన్నాం. గాలి ప్రారంభమయింది. ఏమిగాలి? ఏమిగాలి?? అటువంటిగాలి నే నెప్పుడూ ఎరగను. దాన్ని వర్ణించడం మహాకష్టం. పీడకలని ఏమని వర్ణించగలం? మా వొంటిమీది బట్టలు చించేసింది ఆ గాలి! చించెయ్యడమంటే అక్షరాలా చించెయ్యడమే! ఇప్పుడు తలుచుకుంటే, ఆ గాలిని నేనే నమ్మలేకుండా ఉన్నాను. అటువంటి రాక్షసగాలి పాలబడి మళ్లీ బతకడం దుర్లభం. నే నెలా బతికానో నాకే వింతగా ఉంటుంది. కనిపించని యిసుక రేణువులు మనమీద కక్ష కట్టడం మీకు తెలుసా? నాకు తెలుసు. కంటికగుపడని బురద, నలుసులై మన మీద దాడి చెయ్యడం, నాకు తెలుసు. ఆ భయంకరానుభవం మాటల్లో యిమడదు; ఎంతటిపగవారికైనా ఆ అవస్థవద్దు.

మొదట ఉవ్వెత్తుగా లేచిన సముద్రాన్ని, గాలి తన బలంతో అదుక్కునెట్టింది. ఎప్పుడైతే, గాలిలోని ఉధృతం కొంచెంతగ్గిందో, సముద్రం మళ్లీ పైకిలేచింది. పెళైటజన్నీకి ఒక ప్రత్యేకమైన లంగరువుంది—దాన్ని సి-యాంకర్ (Sea anchor) అంటారు. అది 'కానికల్' (conical) కాన్వాస్ సంచిలా ఉంటుంది. గాలిలో గాలిపటం ఎగిరినట్టు, యిది నీటి అడుక్కి-వెళ్లి, నిట్ట నిలువుగా నిలబడుతుంది. మేము తుపాను

మార్గంలో పడివుండకపోతే, ఈలంగరుసాయంతో పైలట్ జెన్నీని సముద్రమధ్యంలో నిలబెట్టవచ్చు. మేము తిన్నగా తుపానుమధ్యలోకి వచ్చినట్టున్నాం. అందుకనే, స్కూనర్‌లోని అన్నీ ఆ గాలి ఉధృతానికి విరిగిపోవడమో, చినిగిపోవడమో జరిగింది. అప్పటికే నావొళ్లంతా అలిసిపోయింది; కాళ్లు తేలిపోతున్నాయి, కళ్లు మూసుకుపోతున్నాయి. ఇంతలో ఏదో చుట్టూతా తేలికైనట్టయింది; నాదేహంలోని పరమాణువులు, చుట్టూవున్న పరమాణువులమీద, తాత్కాలిక విజయం సాధించినట్టయింది. వెర్రిగాలి తగ్గడంతో సముద్ర కెరటాలు తాటి ప్రమాణాన లేచాయి. ఈ కెరటాల్ని అదుపులోవుంచగల గాలిశక్తి లేదు. తాగినమనిషి తూలినవిధంగా ఆ కెరటాలు మామీదికి దూకాయి. ఆ కెరటాలు చెట్టాపట్టాలేసుకు మామీద కత్తి కట్టాయి. వేయి జలపాతాలమధ్య నిలబెట్టినట్టయింది; జలదేవతకి మతిపోయింది.

పైలట్ జెన్నీ ఏమయిందంటారా? ఏమో తెలియదు. ముక్క ముక్కలుగా విరిగి పిప్పిపిప్పి అయి ఉంటుంది. నా కళ్లు తెరువులకి వచ్చేటప్పటికి మూడింట రెండువంతులు మునిగివున్నాను. తుపానుగాలి తగ్గిపోయిందిగాని, సొరచేపలు (Sharks) ఉన్నాయేమో అని భయపడ్డాను. అదృష్టవశాత్తూ లేవు. ఒక తలుపుచెక్క ఆసరాగా పుచ్చుకు, నేను నీటిమీద తేలివున్నాను. సొరచేపలు తినెయ్యకపోతే, యిరవై నాలుగు గంటలసేపు ప్రాణం నిలుపుకోవచ్చు. మిట్టమధ్యాహ్నంవేళ పైలట్ జెన్నీ ముక్క ముక్కలయింది; ఆపైన రెండుగంటలకి, వర్షం బాగాతగ్గింది.

జలదేవత వాయుదేవుడూ సమాధానపడుతున్నారు - సముద్రం ప్రశాంతత వహించింది. నేర్పుగా గాలి వీల్చకపోతే మునిగిపోయే స్థితిలో ఉన్నాను. సరిగ్గా అదేసమయాన ఏవో కంఠాలు వినిపించాయి. కెప్టెనూ, ఒక నేటివ్వూ మరొక తలుపుచెక్క కోసం నడిసముద్రంలో కొట్లాడుకుంటున్నారు.

"ఫో_దూరంగా ఫో" అని అధికారయుతంగా అంటున్నాడు కెప్టెన్ ఆ నేటివుతో. కెప్టెన్‌కి కాళ్లకి బూట్లుతప్ప వంటిమీద బట్టలేదు; వెనకగావస్తున్న నేటివుని ఆ బూటుకాళ్లతో తంతున్నాడు. ఆ నేటివు తీరగబడటం లేదు - పదిఅడుగుల దూరంలో తనని వుండని స్తే చాలు - అంటున్నాడు.

కెప్టెన్ చేస్తున్నపని నాకు పరమ కిరాతకంగా కనిపించింది. నేటివు అయితేమాత్రం, అతనిదీ ప్రాణమేకదా! నా వొంట్లో శక్తిలేనుగాని, వుంటే ఆ కెప్టెన్‌ని అక్కడే, ఆనడిసముద్రంలో, ముంచేసివుందును - అంతకోపం వచ్చింది. నేటివుని నావైపుగా రమ్మనమన్నాను. ఆ తలుపుచెక్క మొట్టమొదట అతను సంపాయించుకున్నదే; కెప్టెన్‌కదా అని అతనికి చెరిసగం యివ్వబోతే, చివరికి తనని బూటుకాళ్లతో తన్నబోయాడట - ఈవిషయం నాకు, మేము బతికి బయటపడ్డాక, ఒటూ చెప్పాడు.

ఆ నడిసముద్రంలో ఒటూ, నేనూ ఆవిధంగా స్నేహితులమయాం. అతను ఆరడుగులమనిషి; వస్తాదుగాకపోయినా పిరికివాడుమాత్రం కాదు. అతనిగుండెధైర్యం యింతా అంతా కాదు. ఆ తలుపుచెక్కని మేమిద్దరం పంచుకు, ఈదటం మొదలుపెట్టాం. రెండురాత్రులూ రెండుపగళ్లూ నీటిలో ఉండేటప్పటికి,

నాకు జీవితేచ్ఛ నశించింది. కళ్లుమూసేసిన నన్ను, ఒటూ ఎలా రక్షించాడో చెప్పలేను. కళ్లు తెరిచేటప్పటికి, బీచియిసుకలో పడి వున్నాను; నాకు కొద్ది దూరంలో ఒటూ పడివున్నాడు. మళ్లీ నేను కళ్లు తెరిచేటప్పటికి, ఒటూ నాకు కొబ్బరినీళ్లు పడుతున్నాడు.

పైరేట్ జన్కినుంచి ప్రాణాలతో బయటబడ్డవాళ్లం మే మిద్దరమే! అలసటవల్ల చనిపోయివుంటాడు కెప్టెన్; అతను ఆనరాగా వుచ్చుకున్న ఆ తలుపుచెక్క, బీచివొడ్డుకికొట్టుకు వచ్చింది.

ఆ చిన్నద్వీపంలో ఒకవారంరోజులపాటు వున్నాం. ఇంతలో ఒక ఫ్రెంచిఓడవచ్చి, మమ్మల్ని టాహిటీ చేర్చింది. ఆ ద్వీపంలో ఉన్నప్పుడే నేనూ, ఒటూ పేర్లుమార్చుకున్నాం. పేర్లు మార్చుకోవడమంటే, అక్కడి ఆచారప్రకారం, సాటిలేని స్నేహబంధం.

"రెండురోజులు మనం మృత్యుద్వారంలో నిలబడ్డాం," అన్నాడతను.

"మృత్యువు మనకి భయపడింది." అన్నాను నేను నవ్వుతూ.

"మీరు నన్ను తలుపుచెక్కదగ్గిరికిరానిచ్చి, నాప్రాణాలు కాపాడారు. అటువంటి ఉదారుల్ని చూసి, మృత్యువుమాత్రం, ఎందుకు వెనకాడదు?"

"నువ్వు నాకు ఛార్లీవి; నేను నీకు ఒటూని. మనం పేర్లు మార్చుకున్నాం. నువ్వునన్ను 'మీరు' అంటావా? మనం ఈ

భూలోకంనుంచి నిష్క్రమించినా, ఆ
క్షత్రాలవెనక ఒకరికోకరంగా జీవిస్తాం. కాదే

"అవునండి" అన్నాడు ఒటూ

"మళ్లీ 'అండీ' అంటావ్!"

"మిమ్మల్ని 'మీరు' అంటేగాని నాకు బావుండదు. పెదవులనుంచి వెలువడే ధ్వని ప్రధానమా మనసులుగాని! మీరు నాకు ఒటూగా, నేను మీకు ఛార్లీ. నీలి ఆకాశంవెనకా, నక్షత్రాలవెనకాకూడా మీరు నాకూ నేను మీకూ అంతే!" అన్నాడతను.

నాలో నేను నవ్వుకున్నాను - ఏదో చెప్పలేని సంతృప్తితో.

పాపిటీలో మేము విడిపోయాం. విశ్రాంతికిగాను నేను కొన్నాళ్ళపాటు అక్కడవుండిపోయేందుకు నిశ్చయించుకున్నాను. అతను, వాళ్ళస్వగ్రామమైన, 'బారబార' దీవికి వెళ్లాడు. భార్య దగ్గిరికి వెళ్తున్నాననీ, యింక యిటువంటి దూరప్రయాణాలుచేయననీ చెప్పినమనిషి, ఆరువారాలలో తిరిగివచ్చేటప్పటికి, ఆశ్చర్యమేసింది నాకు.

"ఇక్కడనుంచి మీరెక్కడ కెళ్తున్నారు?" అని అడిగాడు వచ్చీరాగానే.

ఒక్కసారి బుజాలెగరేశాను; అది చాలా గడ్డుప్రశ్న.

"ప్రపంచమంతా తిరుగాలని నాకోరిక. ప్రపంచమంతా, సముద్రమంతా, సముద్రంలోని దీవులన్నీ తిరగాలని ఉంది." అన్నాను.

"అయితే నేను మీ వెంటవస్తాను. నాభార్యచని పోయింది," అన్నాడు ఒటూ.

నాకు అన్నదమ్ములులేరు; కాని, ఒటూలాటి సోదరుడు ఎవరికీ-దొరకడు. అతను గురువూ,సచివుడూ, సోదరుడూ సమస్తం. నా బహిఃప్రాణమయాడు ఒటూ. అతనివల్ల నాలోని నీచత్వం నుసి అయింది. నన్ను అతను మనిషిగాచేశాడు. మనిషికివుండ వలసిన ఉదాత్త లక్షణాలు నాలోకలిగేటట్లు చేశాడు. నిగ్రహమూ ప్రేమా రుజువర్తనా అలవడ్డాయి. నీతులు బోధించక, నాతప్పులకి నేను సిగ్గుపడేటట్లు చేసేవాడు. అతనికి మనస్తాపం కలిగించకుండా వుండేందుకు, నాలో సత్ శీలత పెంచుకోవలసి వచ్చింది.

పదిహేడేళ్ళు కలిసివున్నాం. నాకష్టసుఖాల్లో నన్ను కంటికి రెప్పలా కాపాడాడు. ఎక్కడికి వెళ్లినా నాతోపాటు ప్రయాణం చేసేవాడు; నన్ను అంటిపెట్టుకుని వుండేవాడు. పసిఫిక్ మహాసముద్రమంతా, ఈ చివరినుంచి ఆ చివరికి, ముత్యాల కోసమూ డాలర్ల కోసమూ గాలిస్తున్న నన్ను, ఎల్లవేళలా కాపాడుతూండేవాడు ఒటూ. పాపిటీలోని క్లబ్బునుంచి, నేను బయటికి రావడం మరీ ఆలస్యమైతే, అర్ధరాత్రి అయినా నా కోసం కనిపెట్టుకు వుండి నన్ను భద్రంగా యిల్లు జేర్చేవాడు. "నేను చిన్న పిల్లవాణ్ణి కాదుగా!" అన్నాను ఒకటి రెండుసార్లు. నా మాట నాదే; అతని జాగర్తలు అతను మానేవాడు కాదు. 'బొరబొర' దీవిలో అందరూ క్రిస్టియనులు; యితను క్రిస్టియను కూడా కాదు, హీతెన్ (Heathen). భగవంతుడి మాట తర్వాత చూసుకో

వచ్చు; మనుషులందరూ మంచిగా ఉండాలి - అంటూండేవాడు. అతను హంతకుణ్ణి అయినా క్షమించగలడు గాని నీచుణ్ణి క్షమించ లేడు. నీచత్వాన్ని మించిన పాతకం లేదు అతని దృష్టిలో.

నేను డబ్బెట్టి పేకాట ఆడినా, నడిరాత్రి దాకా తాగుతూ కూచున్నా, అతను ఏమీ అనేవాడు కాదు. ఏదయినా, మితం తప్పితే ప్రమాదం, అని వారించేవాడు; అన్నిటి కంటె ముఖ్యం ఆరోగ్యం - అనేవాడు. నా క్షేమం గురించీ, నా భవిష్యత్తు గురించీ నా కంటె ముందు తను ఆలోచిస్తూండేవాడు. నా వ్యాపార విషయాలలో, అతనెందు కంత జోక్యం కలిగించుకొనేవాడో, మొదట్లో తెలిసేదికాదు. నేను ఒకసారి రండోల్ఫ్‌వాటర్స్‌తో భాగస్వామిగా చేరుదామనుకున్నప్పుడు, ఒటూ వడగొట్టాడు. రండోల్ఫ్ మోసగాడని నాకు తెలియదు; ఎలా తెలుసుకున్నాడో ఒటూ తెలుసు కున్నాడు. ఒటూది స్వార్థరహితమైన ప్రేమ; మనసావాచా నా మేలు కాంక్షిస్తూండేవాడు. కొన్నాళ్ళయే టప్పటికి నా విషయాలు నేను ఆలోచించుకోవడం మానేసి, అతనికి వొప్పజెప్పాను.

ఒకసారి నేనూ, ఒటూ 'సామొ' బీచివద్ద నున్నాం. మా పడవ కొద్దిగా యిసుకలో కూరుకుపోయింది. ఆ దీవులలో ఉన్న వారు నరభక్షకులు; కాని, అటువంటి నరభక్షకుల నుంచే మాకు కావలసిన పనివారిని, రిక్రూట్ చేసుకోవలసి వస్తూండేది. ఒకొక్కప్పుడు వారు నమ్మించి గొంతుకోసేందుకు ప్రయత్నించే వారు. అలాటప్పుడు ఒటూ బుద్ధిబలమూ దూరదృష్టే నన్ను కాపాడేవి. ఒటూ తుపాకీ చేతబుచ్చుకు, చుక్కాని దగ్గిర ఉండే

వాడు; నేను బోటులోనే వుండి బీచిమీద నున్న వారితో సంభాషణ సాగించేవాణ్ణి. ఆ సాహసకృత్యాలూ ఆ తెంపరితనమూ తల్చుకుంటే వొళ్ళు గగుర్పొడుస్తుంది.

తూర్పు సోలమన్ దీవుల్లోని మెలైటా వాసులు మొదట్నుంచీ ఎంతో స్నేహంగా ఉంటూ వచ్చారు. కాని, వున్నట్టుండి వాళ్ళకి దుర్బుద్ధి పుట్టింది. శ్వేతవర్ణుని శిరసు సంపాయించాలని వాళ్ళు రెండేళ్ళ బట్టీ డబ్బు పోగుచేస్తున్నారట. తమలో ఎవడైతే 'తెల్లవాడి తల' తీసుకు రాగలడో, అతనికి ఆ పోగు చేసినదంతా యిచ్చేసేందుకు గాను వాళ్ళలో వాళ్ళు పందెం వేసుకున్నారట. దురదృష్ట వశాత్తూ ఆ శ్వేతవర్ణుణ్ణి నేనయాను; బీచిమీదికి వెళ్ళవద్దని ఒటూ వారిస్తున్నప్పటికీ, మొండి సాహసంతో వెళ్లి చిక్కుల్లో ఇరుక్కున్నాను.

పది పన్నెండు బల్లెములు ఒక్కసారి మీదికి వచ్చేటప్పటికి, ఎంతవాడైతే మాత్రం, నేలమీద కూలక, ఏమవుతాడు? ఇంతలో, ఎవరు నా శిరసు ఖండించడమా అని వారిలో వారికి తగాదా వచ్చింది. సరిగ్గా అదే సమయానికి, గదాధరుడైన ఒటూ ప్రత్యక్షమయాడు. ఒటూ గదాయుద్ధం ముందు వాళ్ళ బల్లెములు నిష్ఫలమయాయి. వారి తలలు తపీతపీ పగలడం చూసి ఆశ్చర్య పోయాను. నన్ను చేతుల్లో ఎత్తుకు పడవలోకి తీసుకొచ్చి, తుపాకి పుచ్చుకున్నాడు ఒటూ. గదాఘాతాలు తప్పించుకున్నవారు, తుపాకీ దెబ్బలకి కూలారు. ఎందుకు చెప్పొచ్చానంటే, ఒటూ సాహసం సాటిలేనిది.

మా యిద్దరిదీ పదిహేడు సంవత్సరాల చెలిమి. అతను నాకు ప్రాణాలు ధారపోయడమే గాకుండా ప్రయోజకునిగా చేశాడు. "వయసులో ఉన్నప్పుడు డబ్బుసంపాయించడం తేలిక. యిప్పుడు నీళ్ళమాదిరి ఖర్చుచేస్తే, పెద్దతనంలో మనని ఎవరు చూస్తారు? అదీగాక, వయసులో ఉన్నప్పటిలా, పెద్దతనంలో డబ్బు ఆర్జించలేము. వయసు వృధాచేసుక, వార్ధక్యంలో వాపో తున్న తెల్లవాళ్లు, ఈ పసిఫిక్ దీవులలో కొల్లలుగా ఉన్నారు. మీరు వారికిమల్లే కాకూడదు. ప్లాంటేషన్‌లోని నల్ల బానిస, వొళ్లు వంచి కష్టపడితేగాని సంవత్సరానికి యిరవై డాలర్లు ముట్టడంలేదు. వోవర్సీరు కష్టపడడు; గుర్రంమీాది తిరిగి, నల్ల బానిసలమీాద పెత్తనం చేస్తూ సంవత్సరానికి పన్నెండువందల డాలర్లు పుచ్చుకుం టున్నాడు. స్కూనర్‌లో ఉండే నావికునికి నెలకి పదిహేను డాలర్లు నుడతాయి - తెలివిగలవాడూ కష్టపడి పనిచేసేవాడూ అయితేనే! తాడూ చుక్కానీ పొరబాటున కూడా ముట్టుకోని కెప్టెన్‌కి, మస్తుగా తాగి దక్కగా కాలక్షేపం చేసే కెప్టెన్‌కి, నెలకి నూటయాభై డాలర్లు యిస్తారు. కెప్టెన్‌కి కొన్ని బాధ్యతలు ఉన్నాయని వొప్పుకుందాం; స్కూనర్ మంచిచెడ్డల భారం అతనిది; కాని, ఈ నావికుని కంటె, ఈ కెప్టెన్ కంటె, కడుపులో నీరు కదలకుండా హాయిగా లాభాలుతీసే మనిషి ఓడయజమాని. మహాశంతుస్తుల భవనంలో కూచుని నౌకర్ల చేత ఉపచారాలు చేయించుకుంటూ వుంటాడు ఆయనగారు!"

"బావుంది నువ్వనేది! అయితే మనమొక స్కూనర్ కొందా మంటావా? అయిదువేల డాలర్లు లేనిదే స్కూనర్ రాదు.

అంతడబ్బు మన మీాజన్మలో నిలవ చెయ్యలేం!" అన్నాను నేను.

"తెల్లవాళ్ళు డబ్బు సంపాయించేందుకు చాలా మార్గాలు వున్నాయి. ఆ గొడాల్ కెనాల్ తూర్పువైపున రెండు మైళ్ళ నేల బల్లపరువుగా ఉంది. ఈనాడు దానికి విలువ లేదు. కాని, యింకో రెండేళ్లు పోయాక పరిస్థితులు మారవచ్చు. పెద్ద ఓడలు లంగరు వేసుకు నిలిచేందుకు వీలైన స్థలం. అక్కడివాళ్ళ నాయకుడికి పదివేల చుట్టలూ; పదిసీసాల విస్కీ, ఒక తుపాకీ యిస్తే, - యివన్నీ కలిపి వందడాలర్లు చెయ్యవు - ఆ నేల మీాకు ధారాదత్తం అవుతుంది. కమీాషనర్ దగ్గిర వ్రాతకోతలు జరిపించి, కొన్నాళ్ళయాక యిదే నేలని అమ్మితే, స్కూనరేమిటి, ఓడకొనగలిగేపాటి డబ్బు వస్తుంది."

ఒటూ చెప్పినట్టే చేశాను; రెండేళ్లలో కాదుగాని మూడేళ్లలో మా ప్లాను ఫలించింది. ఆతర్వాత గొడాల్ కెనాల్ లోని యిరవై వేల ఎకరాల పసరిక నేలని నామమాత్రమైనధరకి కొన్నాను. కొనడమంటే 99 సంవత్సరాల 'లీజ్'. ఆలీజ్ సరిగ్గా 90 రోజులపాటు అట్టేపెట్టుకు, ఒకకంపెనీకి చాలా పెద్దమొత్తానికి అమ్మాను. మునిగిపోయిన ఒక ఓడని శేవనత్తి, అందులోవి మాయిష్టంవచ్చినట్టు అమ్ముకునేందుకుగాను, వందపౌనులకి వేలాంలో పాడాం; అన్ని ఖర్చులూపోను మాకు మూడువేల పౌనులు మిగిలింది. ఆడబ్బుతోటే సావాయ్ ప్లాంటేషన్‌కొని, 'ఉపొలు'లో కోకోపంట వేశాను.

యిప్పుడు వెనకటిమల్లే సముద్రయానం చేయడంలేదు; చేయవలసిన పనికూడా లేదు. ఒటూ మునుపూ యిప్పుడూ ఒకే

విధంగా ఉన్నా, నాజీవనపద్ధతి మారింది. ఒటూ రుణం, ప్రేమ రూపేణా తీర్చుకోవలసిందేగాని, అతనికి డబ్బుతో నిమిత్తంలేదు. ఇక, మా పిల్లలకి అతనంటే మహా చెడ్డ ఆపేక్ష. పిల్లలవిషయంలో అతనూ అంతే; ఆపిల్లలతోడిదే అతనిలోకం. వాళ్ళకి నడక నేర్పాడు; ఆటలు నేర్పాడు; చేపలుపట్టడం, గమ్మత్తులుచెయ్యడం ఎన్నినోన్నో విద్యలునేర్పాడు.

ఒకరోజున అన్నాడునాతో "బారబారలోని మావాళ్ళందరూ క్రిస్టియనులు. క్రీస్తుమతం స్వీకరించని నేనంటేవాళ్ళకి యిష్టంలేదు." నేను సంపాయించిన ధనరాసులలో అతనికి చెందవలసినది కొంతఉంది; కాని, అతనిచేత ఎలాఖర్చుపెట్టించాలో నాకు తెలిసేదికాదు.

'లా' ప్రకారం తనుకూడా కంపెనీలో భాగస్వామిగా ఉంటే బావుంటుందని నేననేటప్పటికి, "పెళ్లైట్ జిన్నీ మునిగిపోయిననాటినుంచీ మనిద్దరమూ భాగస్వాములమేకదా ! నాకేమయినా డబ్బుకావలిస్తే, ఆఫీసులోనుంచి తీసుకుంటున్నా. నాకేంకావాలి!!" అని అన్నాడు ఒటూ.

మెడలువిరిచి, అతన్ని కంపెనీలో భాగస్వామిగా చేశాను. సంవత్సరాంతానికి అతని కాతానున్న ఖర్చు, ఎనభై ఏడుడాలర్ల యిరవై సెంట్లు; అతని వాటాకివచ్చిన లాభాలు కొన్ని వేలడాలర్లు. ఇదేమిటంటే, - ఆ డబ్బు అలావుండనీయండి, నేనేమి చేసుకుంటాను? - అనేవాడు ఒటూ. తన తదనంతరం, తన ఆస్తి అంతా నాకు చెందాలని, విల్లురాసి జాగ్రత్తచేసినట్టు అతను పోయాక నాకు తెలిసింది.

ప్రతిబాంధవ్యానికీ మొదలు ఎంతనిజమో, తుదికూడా అంతేనిజం. హాలీడే కోసమని ఫ్లోరిడాదీవిలోని మాఆస్తులు చూసుకోనేందుకు వెళ్లాం. 'సావు' ప్రాంతాల వింతవస్తువులగురించిన బేరాలు జరుపుతున్నాం. ఉన్నట్టుండి మా దోనెపడవ బోల్తాకొట్టింది. 'సావు' తీరం సొరచేపలకిప్రసిద్ధి. పడవ బోల్తాకొట్టేటప్పటికి నలుగురు నేటివ్‌లూ నేనూ ఉన్నాం అందులో. స్కూనర్ వందగజాల దూరంలో ఉంది. తలకిందులయిన దోనెపడవ ఆసరాగాచేసుకు, మరొక పడవకోసం నేను అరుస్తూండగా, నేటివులలో ఒకతను కెవ్వుమన్నాడు. అతన్నీ పడవనీకూడా అడుక్కి లాగింది సొరచేప. చూస్తూ చూస్తూ వుండగా అతన్ని గుటుక్కున పలహారంచేసింది సొరచేప. అతని చావుతో పడవ పైకి తేలింది. ముగ్గురు నేటివులూ మళ్లీ పైకి పాకి, పడవని మళ్లీ యథాప్రకారంగా తిప్పడానికి ప్రయత్నించబోయారు. అది తెలివితక్కువపని; నిష్ఫలమని నాకు తెలుసు; తలకిందులైనపడవ అంతసులువుగా వెనక్కి తిరగదు.

పడవవిషయం వొదిలేసి, స్కూనర్‌వైపుగా ఈదడం మొదలుపెట్టాను; - నేనంతదాకా వెళ్లేలోపున ఏదో ఒక పడవ నాకోసం ఎదురురాదా అను ఆశతో. నేటివులలో ఒకతను నాముందుగా ఈదుతూ, సొరచేపలు మార్గమధ్యంలో అడ్డుపడకుండా చూస్తున్నాడు. ఇంతలో దోనెపడవ దగ్గిరవుండిపోయిన యిద్దరు మనుషులూ కెవ్వున అరిచారు. పదహారు అడుగులసొరచేప, నాముందు ఈదుతున్న నేటివుని నోటకరుచుకుంది. అతను

గిలగిల కొట్టుకొంటూ యమబాధతో కీచుమంటున్నాడు. ఆ సొర చేప అతన్ని లోపలికి ఎక్కడికో పట్టుకుపోయింది.

నేను మొండిగా ఈదుకుంటూవస్తున్నాను. ఇంతవరకూ సొరచేప నన్ను అడ్డలేదుకదా అనుకుంటూవుంటే, ఒకటి ప్రత్యక్ష మయింది. నేటివులిద్దరినీ పొట్టనెట్టుకున్న సొరచేపో, లేక మరొకటో! మునుపటంత వేగంగా ఈదలేను; దానిని తప్పించుకుంటూ ఈదాలి. మొండి ధయిర్యంతో నారెండుచేతులూ దానిముక్కు మీదవేసి వెనక్కితోశాను. అది తోకముడుచుకు పారిపోయి, కాసేపటికి మళ్లీ తయారయింది. రెండోసారికూడా అదేవిధంగా తప్పించుకున్నాను. మూడోసారి మళ్లీ అదేవిధంగా ఎదుర్కోబోతూండేవేళకి, దానిపొలుసుతగిలి నాచేతులు కొద్దిగా గీరుకున్నాయి.

లాభంలేదు, వోడిపోతున్నా కాబోలు - అనుకున్నాను; స్కూనర్ యింకా అరవై గజాలదూరంలో ఉంది. నేను నిస్త్రాణ చెందిన స్థితిలోఉండగా, నాకూ సొరచేపకీ మధ్యగా మరొక దేహం నుంచుంది. "ఈసొరచేపలగురించి నాకుతెలుసు; మీరు స్కూనర్ వైపుగా ఈదండి," అన్నాడు ఒటూ.

అతను చెప్పినట్లు నెమ్మదిగా ఈదసాగాను. ఒటూకూడా నావెంట వస్తున్నాడు. సొరచేపకీ, నాకూ మధ్యగవుండి దానిని ఆటలాడిస్తున్నాడు. ఆటలేగాని, తనకిదెబ్బ తగలకపోయేటప్పటికి సొరచేపకి ధైర్యం ఎక్కువవుతోంది.

"ఇంక ఈదలేను, బ్రదర్," అన్నాను. స్కూనర్ పది గజాలదూరంలో ఉంది.

"మీరు అధైర్యపడకండి దానికి మతిపోయేటట్టు చేస్తాను చూడండి, - మీరు అలా ఎడమవైపుగా, యింకొంచెం ఎడమ వైపుగా ఈదండి. నేను గబగబా ఈదేశాను. స్కూనర్ మీదకి వచ్చి, వెనక్కి తిరిగిచూసేటప్పటికి ఒటూ లేడు. మరోక్షణంలో ఒటూ మొండిచేతులు, మణికట్లదగ్గర విరిగిన మొండిచేతులు, రక్తంకారుతూ నీటిమీద కనిపించాయి.

"ఒటూ" అని మృదువుగా, అమరగానంలాటి వాక్కుతో పిలిచాడు. అదే మొదటిసారీ చివరసారీ నన్నుతను పిలవడం.

"గుడ్‌బై, ఒటూ" అన్నాడు.

అతను నీటి అడుక్కి వెళ్లిపోయాడు; నేను కెప్టెన్ చేతులలో మూర్ఛపోయాను.

ఆవిధంగా ఆ ప్రకరణముగిసింది; పదిహేడేళ్ల స్నేహబంధం మారి. శ్వేతేతరజాతి మనిషికీ, శ్వేతజాతి మనిషికీ మధ్య యిన్ని సంవత్సరాల యింతగొప్పస్నేహం మాయిద్దరిదే అనుకుంటా. ఒటూ భగవంతుని ప్రియతనయులలో ఒకడు. కాదని ఎవరన గలరు?

# అతిథి

సెప్టెంబరునెల రాత్రివేళ. ఇంట్లో ఉన్నవారందరూ హెర్త్ (hearth నిప్పుగూడు - నెగడి) చుట్టూ చేరారు. కొండ వాగులలోనుంచి కొట్టుకొచ్చి, ఎండకి బాగా ఎండిన కలప, ఆనెగడిలో ఎర్రగా మండుతోంది. అగ్నిశిఖరాలు పొగగొట్టం దాకా ప్రజ్వలిస్తున్నాయి. ఆమంటలవల్ల గది అంతా ఎర్రపడింది. ఆ ఎర్రకాంతిలో తల్లితండ్రులముఖాలు ప్రశాంతంగా ఉన్నాయి; పిల్లలు నవ్వుతున్నారు; పదిహేడు వసంతాల పెద్దమ్మాయి ఆనందాల రాసిలా ఉంది; ఏదో కుట్టుకుంటూ కూచున్న అమ్మమ్మ, స్తిమితపడ్డ వార్ధక్యంలోని సుఖశాంతులకి చిహ్నంలా ఉంది. న్యూ యింగ్లండులోని చలిప్రదేశాలలో మరీ చలిగా ఉండేచోట, ఈ కుటుంబం సౌఖ్యవంతంగా జీవించగలుగుతోంది. తెల్లకొండ లోయలో వారు ఒకయిల్లు కట్టుకొని, అందులో హాయిగా ఉంటున్నారు. మహోపద్రవమైన చలికీ అర్ధరాత్రివేళ దొర్లే కొండరాళ్ల శబ్దానికీ వెరవకుండా కాలం గడుపుతున్నారు.

పెద్దమ్మాయి ఏదో చిలిపిమాట చెప్పేటప్పటికి అందరూ పకపక నవ్వారు; చర్రున వీచేగాలి వీధిగుమ్మందగ్గిర నిలిచినట్టయింది. అందరూ చెవులు నిక్కపొడుచుకు వింటున్నారు. ఇంతలో వీధితలుపు ఎవరో తట్టినట్టయింది. ఇటువంటి ఈదురు గాలిలో, యింత ఉపద్రవమైన చలిలో ఎవరు చెప్మా—అన్నట్టు ఎదురుచూస్తున్నారు యింట్లోవాళ్లు.

ఈకుటుంబం ఉంటున్నది నిర్మానుష్యమైన ప్రదేశం అయినప్పటికీ, ప్రపంచవిషయాలు వారికి అను నిత్యం తెలుస్తూ వుంటాయి; తెల్లకొండలలోని ఈలోయ ప్రదేశంగుండానే వర్తక రహదారి ఉంది. ఇటు మెయిని - నగరం వెళ్లాలన్నా, అటు సెయింట్ లారెన్స్ తీరానికి వెళ్లాలన్నా, లేదా పచ్చకొండల దగ్గిరికి వెళ్లాలన్నా ఈమార్గంతప్ప మరొకటిలేదు. స్టేజికోచ్ ప్రతి రోజూ వారి గుమ్మందగ్గిర ఆగుతుంది. కొండలలోని ఏకాంతాన్ని భరించలేని బాటసారి, ఒకక్షణం వీరియింటిదగ్గిరఆగి, ఆదిగులు తగ్గేందుకు ఈమాటా ఆమాటా మాట్లాడివెళ్తాడు. పోర్టులాండ్ మార్కెట్‌కి గొర్రెలూ, పశువులూ తోలుకువెళ్లేవారయితే, ఆపూటకి అక్కడవుండిపోయి, మర్నాడు పొద్దుట వెళ్లేవారు. అది ఒక పాతకాలపు 'టావరిన్' (tavern సత్రము). బాటసారికి వుండేందుకు చోటుయిచ్చి, తినేందుకు తిండిపెట్టడమేగాకుండా, అతనిని ఆపూటకి తమలో ఒకనిగా భావించేవారు. భోజనానికీ, వసతికీ 'యింత' అని లెక్కఉంటుందిగాని, ఆప్యాయతకి విలువ కట్టడమెలా? బయటితలుపుకీ లోపలతలుపుకీ మధ్యనున్న వరండాలో కాళ్ల చప్పుడు వినిపించగానే, అమ్మమ్మ, పిల్లలూ అందరూ లేచినిలబడ్డారు - ఆ రానున్న అతిథికి స్వాగత మిచ్చేందుకు.

ఒకయువకుడు తలుపుతెరుచుకు లోపలకు ప్రవేశించాడు. అతని ముఖం నిరాశతోనూ మనోవేదనతోనూ బరువుగాఉంది. బహుశా, రాత్రివేళవ్వడమూ, ఆచీకటిదారిని, ఒక్కడూ ప్రయాణం చెయ్యడంవల్లనేమో! వారి ఆతిథ్యమర్యాదకి అతని నేత్రాలు

వికశించాయి. పెద్దావిడ అతనికోసం కుర్చీతుడిచింది; చిన్నపిల్లలు రెండుచేతులూ చాచి, అతన్ని ఆహ్వానించారు. పెద్దమ్మాయి మందహాసము, దృక్కులు అవ్యక్తితో ముగ్ధపరిచయం చేసుకున్నాయి.

"ఆ వెచ్చని నెగడి ఎంతహాయిగాఉంది. చుట్టూ యింత మంది ఉన్నప్పుడు, దాని వెచ్చదనం ద్విగుణీకృతమవుతుంది. ఈ తెల్లకొండలమీద చలికి నా వొంట్లో నెత్తురు గడ్డ కట్టుకుపోయింది. బార్ట్లెట్ నుంచి యింతదాకా ఒకటే ఈదురుగాలి!" అన్నాడా యువకుడు.

"అయితే మీరు వెర్మాంట్ వైపు వెళ్తున్నారన్న మాట," అన్నాడు యింటియజమాని, యువకుని బుజంమీద నున్న సంచి అందుకుంటూ.

"అవును, బర్లింగ్టన్ వెళ్లాలి; యింకాపైకివెళ్లాలి; ఈ రాత్రికి క్రాఫర్డ్ చేరుకోగల ననుకున్నాను. కాని, ఈ ఈదురుగాలిలో అడుగు ముందుకు పడదుకదా! అయినా, యిటువంటి వెచ్చదనం, ఈ ఆతిథ్యం తెలుసుకున్నాక క్రాఫర్డ్ చేరుకోక పోతేనేం!! ఈ నెగడి నాకోసమే వెలిగించారా అన్నట్టుగా ఉంది."

ఉన్నదున్నట్టు ముఖంమీద చెప్పే స్వభావం ఆ యువకునిది. అతనుకూడా ఆకుటుంబంలోని వారితోబాటు, నెగడిదగ్గిర కుర్చీలో కూచున్నాడు. ఇంతలో ఏదో పెద్దవస్తువు కొండమీద నుంచి దొర్లుతూ పడ్డట్టు శబ్దమయింది. అందరూ ప్రాణాలు బిగ

బట్టుకు విన్నారు. అతిథి కొద్దిగా బెదిరాముగాని ఇంట్లోవారికి అది అలవాటే! తెల్లకొండ, బండరాళ్లు కొన్నిటిని, నేలమీదికి దొర్లిస్తోంది.

"మనం తనని మర్చిపోతామేమోనని ఆ పర్వతరాజు రాళ్లు రువ్వుతున్నాడు. ఒక్కొక్కప్పుడు తల పాకింది, మీదకి దూకేటంత హడావిడిచేస్తాడు. మేము పాతకాపులమనీ, మంచి వాళ్లమనీ అతనికి తెలుసు. అంతగా ప్రమాదమైతే, దాక్కునేందుకు ఒక స్థలముంది;" అన్నాడు ఇంటి యజమాని.

యువకుడు సుష్టుగా భోంచేసి, కుటుంబవ్యక్తులతో పిచ్చాపాటీ ప్రారంభించాడు. తామందరూ ఎంతోకాలంగా తెలిసినవారిమాదిరి, మాటల్లో పడిపోయారు. ఆ యువకుడు కులీనవంశస్థుడు; భాగ్యవంతుడు; ఎవరితోటీ ఎక్కువమాట్లాడడు; తను ధనవంతుడైనప్పటికీ, సామాన్యులపట్ల ఎంతో కరుణ, ప్రేమ. బీదవారిని సోదరులుగా చూసుకుంటాడు. ఈ ఇంట్లో అతనికి వెచ్చదనమూ ఆత్మీయతా కనిపించాయి. పర్వత లోయలలో పుట్టే సహజకవితాస్రవంతి, ఈ నాలుగు గోడలమధ్య నాట్యమాడుతోంది. జీవితమంతా తను ఏకాకిగా ప్రయాణం చేస్తున్నాడు; తనది ఒంటరిబతుకు; స్నేహబంధాలు పెరక్కుండా కాపాడుకుంటూవచ్చాడు. ప్రతికుటుంబానికీ ఆయాకుటుంబ రహస్యాలు ఉంటాయి; ఆరహస్యమందిరం దగ్గిరకి ఇతరులని రానీయరు. కాని, ఈ రాత్రి, ఈయువకుడు తనహృదయావేదన వ్యక్తబరుస్తూంటే, అందరూ సానుభూతితో వినసాగారు; అంద

రికీ అతను తలోవిధంగా సన్నిహితుడయాండు. జన్మబాంధవ్యం కంటె విధివలయం తీవ్రతరం గనకనే, వారంత దగ్గిరవారయారు.

ఆ యువకుని మనసులో ఆకాశాన్ని అంటే కోర్కెలు ఉన్నాయి. ఏదో సామాన్యపు బతుకు బతికి పేరూ ఊరూ లేకుండా చనిపోకూడదు. తన వెర్రి కోర్కెలు ఒక నిర్ణీత పథాన నడిచి, తన జీవితాన్ని ఉజ్వలంగా చేయాలి. తను సాధించిన దాన్ని గురించి ప్రజలు పదేపదే చెప్పుకోవాలి. తన బతుకుబాట తనకి కష్టతరంగా ఉండవచ్చు. కాని, ముందు తరాలవారు ఈ 'మహనీయుని' గురించి చెప్పుకోవాలి. ఆ కీర్తి చంద్రికలు వెలా వెలా పోకూడదు; పుట్టిననాటి నుంచి చచ్చేవరకూ తను అహో రాత్రాలు ఎంత కష్టపడ్డదీ లోకులకి తెలియాలి.

కళ్లు తళతళలాడుతూండగా ఆ యువకుడు అన్నాడు: "ఇంత వరకూ నేనేమీ చేయలేదు. రేపు నేను ఈ భూ మండలం నుంచి నిష్క్రమించడం సంభవిస్తే, నా గురించి తెలుసుకోవలసినది ఏమీ ఉండదు. నేనూ ఒక సామాన్య బాట సారిని. అతని ఊరూ పేరూ ఏమిటనికూడా ఎవరూ అడగరు. నా లక్ష్యం సాధించనిదే నేను చనిపోను. అంత వరకూ మృత్యువు ఆగకేమిచేస్తుంది?"

అతని మాటల్లో సహజత్వమూ, అతని భావనలో శాంతీ ఉట్టిపడుతున్నాయి. ఆ కుటుంబంలోని మనుషులకి అతని ఆలోచనలు కొత్తకొత్తగా ఉన్నాయి.

పెద్దమ్మాయిని వుద్దేశించి, "నా మాటలకి నవ్వుకుంటు న్నావా? నా కోర్కెలు అర్థరహితంగా ఉన్నాయా? ఒకనాడు

నా ఆశల గాలిపటాన్ని చూసి లోకం ఆనందించాలి," అన్నాడు యువకుడు.

"లోకం మనగురించి చెప్పుకోకపోతేనేం! ఇలాటి వెచ్చని మంటదగ్గిర కూచుని, వున్న దానితో సరిపెట్టుకోవడంలో సుఖం లేదా?" అని అడిగిందా అమ్మాయి కొంచెం సిగ్గుపడుతూ.

"ఈ యువకుడు చెప్పేది స్వభావసిద్ధమైన కోర్కె. నా చిన్నతనంలో నాకూ అలానే ఉండేది. ఇతని మాటలు వింటూంటే నా చిన్నతనపు రోజులు జ్ఞాపకం వస్తున్నాయి," అన్నాడు యింటి యజమాని.

"జ్ఞాపకమొస్తాయి'! నేను బతికుండగా జ్ఞాపకమొచ్చి లాభమేమిటి?" అన్నది యజమాని భార్య కఠినంగా.

"అలా అంటావేమిటి, ఈస్తర్! నువ్వు లేకపోతే నేను వుంటానా? నువ్వూ నేనూ ఒకటికాదా? చిన్నప్పటి కోర్కె సంగతి చెప్పా. యిప్పుడు నాకు అలా ఉండదు. ఒక చక్కటి తోట కొనుక్కుని, చుట్టుపక్కల వాళ్ళందరూ మనని గొప్పగా చెప్పుకునేటట్టు ఉండాలని వుంటుంది. అప్పుడు మనకి డబ్బే గాకుండా సాంఘికగౌరవంకూడా లభిస్తుంది. నేనొక గొప్ప న్యాయవాది నవుతాను. జనరల్‌కోర్టుకి రమ్మని నాకు ఆహ్వానం వస్తుంది. నేను పెద్దవాణ్ణి అవుతాను. బంధు మిత్రాదులూ, నౌకర్లూ, నువ్వూ, పిల్లలూ మంచంచుట్టూ నిలబడి విలపిస్తూం డగా, ప్రాణాలు వొదులుతాను. పాలరాతిమీద నా ఊరూ, పేరూ, వయసూ, ఒక ప్రార్థనాగీతం చెక్కి, సద్వర్తనుడైన ఒక

క్రిష్టియన్ మరణించాడు—అంటారు," అన్నాడు యింటి యజమాని.

"అదిగో, అదే నేనూ అంటూంట. ఆ రానేది నల్ల జాతి మీద అయినా, పాలరాతిమీద అయినా, కోరిక లెప్పుడూ ఆకాశాన్ని అంటుతూ వుంటాయి. అది మానవలక్షణం. విశ్వ మానవ హృదయంకోసం వెర్రిచేతులు చాస్తాడు మానవుడు," అన్నాడు యువకుడు.

"ఇవ్వాళంతా ఏదో కొత్త కొత్తగా ఉంది. మనసులు యిలా గాలిపాటున ఎగరడం మంచిది కాదంటారు," అంది యజమాని భార్య కన్నీళ్ళతో.

చిన్న పిల్లలని పక్కగదిలోకి తీసుకువెళ్ళి పడుకో బెట్టారు; కాని, వాళ్ళు పడుకుని కూడా నెగడి దగ్గిర జరుగుతున్న మాటలే వింటున్నారు. అచ్చట నున్న అందరి హృదయాలలోనూ ఏవో వింత కోర్కెలు గంతులేస్తున్నాయి. చిన్న పిల్లలలో ఒక అబ్బాయి, "అమ్మా, అమ్మా - నువ్వూ, నాన్నా, అమ్మమ్మా ఆ కొత్తతనూ, మీరంతా వెంటనే వెళ్ళి, ఆ ఫ్లూమ్ వాగులోని నీళ్ళు తాగిరండి, చూస్తాను!" అన్నాడు.

తెల్లకొండలలోని మంచునీళ్ళ ప్రవాహం ఆ ఫ్లూమ్. వెచ్చని పక్క, వెచ్చని యిల్లూ వొదిలి, వాళ్ళందరినీ మంచు ప్రవాహం దగ్గిరికి పొమ్మన్న, ఆ కుర్రవాని కోరికకి యింట్లో వాళ్ళందరూ ఫకుక్కున నవ్వారు. సరిగ్గా అదే సమయాన వీధిలో ఏదో బండి నిలిచినట్టయింది. ఆ బండిలోనున్న యిద్దరో ముగ్గురో గొంతెత్తి పాట పాడుతున్నట్టున్నారు.

"నాన్నా, వాళ్ళు పిలుస్తున్నారు," అంది పెద్దమ్మాయి.

వాళ్ళు నిజంగా తనని పిలిచారా లేదా, అని యింటి యజమానికి అనుమానం వేసింది. వాళ్ళంతట వాళ్ళు లోపలికి వస్తే బావుంటుంది గాని తనువెళ్ళి, - లోపలికిరండి, అని వర్తక ధర్మంగా అనడమేమిటి అనుకున్నాడు. వీధివాకిలి దగ్గిర నిమేష మాత్రం ఆగిన బండి, - దాని పాటల ధోరణిలో అది ముందుకి సాగింది.

"అమ్మా, అమ్మా, ఫ్లామ్ దగ్గిరికి మీరా బండిలో వెళ్ళాల్సింది," అన్నాడు యిందాకటి కుర్రాడు.

వాడి మాటలకి అందరూ నవ్వారు; కాని పెద్దమ్మాయి ముఖం మీద ఏదో మబ్బుతెర కమ్మింది. ఆమె మంటలవంక సాలోచనగా చూసి, దీర్ఘంగా నిట్టూర్పు విడిచింది. మళ్ళీ తనలో తను సిగ్గుపడి నవ్వుకుంది. యువకుడు ఆమెవంక పరిశీలనగా చూశాడు.

"ఏమీలేదు - ఏదో దిగులుతోచింది," అంది ఆ అమ్మాయి తలవంచుకు నవ్వుతూ.

"ఇతరుల హృదయాలలో ఏముందేదీ తెలుసుకోగల శక్తి నాకు వుంది. నీ మనసులో రహస్యం చెప్పనా? వెచ్చని మంట దగ్గిర కూచుని, అకారణంగా వణికే యువ్వని మనసులో వుండగల రహస్యం చెప్పనా? కన్నతల్లి పక్కనవుండగా దిగులుపడే కన్నె మనసులోని భావన, మాటల్లోకి మార్చి చెప్పనా?" అని అన్నాడా యువకుడు.

"ఆ భావన మాటల్లోకి మారితే కన్నెతలంపు లెందు కవుతాయి? - అవవు," అంది పెద్దమ్మాయి, అతిథి చూపులు తప్పించుకుంటూ.

యువతీ యువకుడూ వేరేగా మాట్లాడుకున్న మాటలవి. వారి హృదయాలలో ప్రేమబీజం మొలకలెత్తుతూ వుండవచ్చు. అటువంటి గంభీరధోరణిగల పురుషులు స్త్రీ హృదయాన్ని యిట్టే ఆకర్షిస్తారు. అతను పురుషాన్వేషణకి చిహ్నమైతే, ఆమె లాలిత్యానికి మారుపేరు. యిద్దరూ ఏమో ఏమో కబుర్లు చెప్పుకుంటున్నారు. పర్వతలోయ గుండా వచ్చే ఈదురుగాలి, మరీ కీచుమంటోంది. ఈ మంటలుచూసి మనదగ్గిరికి రావడానికి భయ పడుతున్న దయ్యాలు చేసే అట్టహాసంలా వుందది - అన్నాడు అతిథి. ఇంకొంచెం పుల్లలు నెగడిలోకి తోసి, గదిలోని వెచ్చదనం పెంచారు. ఆ మంటల వెలుగు చుట్టూ వున్న మనుషుల మొగాల మీాద చిత్ర విచిత్రంగా పడుతోంది. బలిష్ఠుడైన తండ్రి, కష్ట సుఖాలు తెలిసిన తల్లి, వెర్రి ఆశల యువకుడు, బంగారు కలల యువతి, సాధువైన ముసలావిడ, అన్నెపున్నెము లెరుగని చిన్న పిల్లలు - అందరూ చుట్టూతా ఉన్నారు.

క్షణకాలం వూరుకోని చేతులతో బట్టలు కుడుతున్న ముసిలావిడ, తలపైకెత్తి యిలా అంది: "మీారందరూ మీా ఆశల గురించీ మీాభవిష్యత్ గురించీ చెప్పుకుంటున్నారు. మీా మాటలతో నామనసుకూడా డోలాయమానమయింది. కాటికి కాళ్లు చాచుకున్న నేను కోరుకోవలసిన దేమిటంటారా? నాకూ ఒక చిన్నకోరిక లేకపోలేదు."

ఏమి టేమిటని యజమాని, యజమాని భార్య ఏకకంఠంతో అడిగారు.

అప్పుడా ముసలావిడ అంది: "నన్ను శవపేటికలో పెట్టాక, వేసుకోవలసిన గౌనూ అదీ నేనెన్నేళ్ల క్రితమో కుట్టించుకు అట్టే పెట్టుకున్నాను. పెళ్లినాడు వేసుకున్న గౌను కంటె మంచిది కుట్టించుకున్నాను; ఆగౌనుకి సరిపడేటోపీకూడా కొనుక్కున్నాను. శవాన్ని శవపేటికలో ఉంచాక, గౌను కుచ్చెళ్లు సరిగా లేక పోయినా, టోపీ సరిగా పట్టకపోయినా, శవం తన స్వహస్తాలతో వాటిని సరిచేసుకోవలసివస్తుందనే నమ్మకం, మాచిన్నతనంలో ఉండేది. ఈరాత్రి ఎంచేతనో ఆ నమ్మకంమాట జ్ఞాపక మొస్తోంది."

"అలాటిసంగతులు చెప్పకు, అమ్మమ్మా," అంది పెద్దమ్మాయి భయపడుతూ.

"ఇందులో కంగారుపడేందు కేముందిగాని, నన్ను శవ పేటికలో పెట్టాక, మీలో ఎవరో ఒకరు, నాముఖంముందు అద్దం పట్టుకు నుంచోండి కాసేపు. అదే నా కడసారికోరిక. నేను ఎలా ఉన్నదీచూసుకు, పొరబాట్లుగానివుంటే, సర్దుకోగలుగు తానేమో!" అని అనేసింది అమ్మమ్మ - మనసులో బరువు దించేసుకున్నట్టు.

"పెద్దవాళ్లకీ చిన్నవాళ్లకీకూడా శవపేటికలగురించీ శిలా విగ్రహాలగురించీకదా కలలు? మునిగిపోతున్న ఓడలోని నావికుడు తన సమాధి స్థలం గురించీ, శవపేటికగురించీ ఏమనుకుంటాడో,

పాపం! ఆ విశాలసముద్రమే అతనిపాలిట అనంతసమాధి,” అంటూ గొణుక్కున్నాడు అతిథి.

ముసలావిడ భయంకరాలోచన మిగతా మనుష్యుల్ని రెండునిముషాలపాటు వుక్కిరిబిక్కిరి చేసింది. వాళ్లు తేరుకొనే లోపుగానే, ధనధనామంటూ బండగాళ్లు దొరులుతూన్న ధ్వని వినిపించింది. యిల్లు యావత్తూ పునాదులతోపాటు యిటూ అటూ కదిలింది. పెద్దలూ పిన్నలూ ఒకరివంక ఒకరు భయోత్పాతంతో చూసుకు, అందరూ ఒక్కసారి కెవ్వున కేకపెట్టారు.

“భూకంపం - భూకంపం.”

ప్రాణభయంతో అందరూ యింట్లోనుంచి బయటికి ఒక్కదూకు దూకి, యజమాని చెప్పిన రక్షణస్థలందగ్గిరికి వెళ్లారు. పాపం - వున్నచోటవుండక, మృత్యువుకి ఎదురుగావెళ్లారువాళ్లు. పర్వతం రెండుముక్కలుగా కూలి, యింటికి చేరోవైపునా భీభత్సంగాపడింది. ఆరాళ్లగుట్టలో కప్పడిపోయిన దేహాలు కనిపించనుకూడా కనిపించలేదు.

మర్నాడు తెల్లారే టప్పటికి, ఆ యింటి పొగగొట్టంలో నుంచి పొగ, ఎప్పటికి మల్లేనేవస్తోంది. నెగడిచుట్టూవున్న కుర్చీలు యథాప్రకారంగా ఉన్నాయి. ఆ తొందరలో వాళ్లు వొదిలేసి వెళ్లిన వస్తువులు అలానే ఉన్నాయి. సమస్తమూ ధ్వంసమయింది; కాని, ఆయిల్లుమాత్రం చెక్కుచెదరకుండా ఉంది.

ఆ చుట్టుపట్ల ఆ కుటుంబంగురించి ఎవరికి తెలీదూ? అంద రికీ తెలుసు. వారి కథ ఒక యితిహాసంగా మారింది; వారి జీవన మొక పద్యకావ్యంగా రూపొందింది.

ఒక అతిథి ఆకాళ రాత్రివేళ, వాళ్ల యింటికివచ్చాడనీ, వాళ్లతోబాటు అంతమొందాడనీ కొందరన్నారు. 'ఆ...అటు వంటి అతిథివచ్చాడనేందుకు తగుసాక్ష్యంలేదు' - అన్నారు మరి కొందరు. తనపేరు చిరస్థాయిగా నిలవాలనుకున్న ఆ యువకుని కలలు, ఆ విధంగా అంతమొందాయి; అతని ఊరూపేరూ తెలియదు. అతనిచరిత్రఏమిటో, అతని జీవితమేమిటో, అతని లక్ష్యమేమిటో ఎవరికీతెలియదు. పాపం, అతనిచావుపుట్టుకలే సంశయాత్మకం !

# శిలాముఖము

## (నెథానియల్ హాతారన్)

పొద్దువాలింది. తల్లీ కొడుకూ తమఇంటిగుమ్మందగ్గర కూర్చొని దివ్యశిలాముఖాన్నిగురించి మాట్లాడుకుంటున్నారు. వాళ్లు తలపైకెత్తితేచాలు, కొన్నిమైళ్లదూరంలోవున్న దివ్య శిలాముఖమండలం విస్పష్టంగా గోచరిస్తుంది.

ఏమిటాదివ్యశిలాముఖము?

ఎత్తయిన పర్వతాలమధ్యనున్న ఆలోయలో, కొన్నివేల మంది నివశిస్తున్నారు. ఆకొండకోనల్లోని దట్టమైన అడవుల్లో కొందరు నివశిస్తున్నారు. చదును బయళ్లూ వాలుప్రదేశాలూ సేద్యంచేసుకుంటూ మరికొందరు నివశిస్తున్నారు. పర్వతలోయ లోని నదీజలం, దూదిమిల్లులు తిప్పడానికి అనువుగా మార్పిడి జరిగినచోట, అనగా ఆప్రాంతాలనున్నగ్రామాలలో చాలా మంది ఉంటున్నారు. వివిధజీవనవృత్తుల నవలంబించారు యిక్కడి మనుషులు. ఆలోయలో పెరిగినవాళ్లందరికీ పిన్నాపెద్దా తారతమ్యంలేకుండా ఈ దివ్యశిలాముఖం ఒకరకంగా ఆత్మబంధువు. శిలాముఖాన్నిగురించి మాట్లాడుకోకుండా వాళ్లు ఉండలేరు.

మనిషి చెక్కిన విగ్రహంకాదు ఆ దివ్యశిలావిగ్రహము. పర్వతరాజే ఆ శిలలలోనుంచి శిలావిగ్రహాన్ని సృష్టించాడు. దూరమునుంచిచూస్తే, ఆరాళ్లు మనిషి మొహంలా కనిపిస్తాయి.

ఆ పర్వతశిఖరంమీద నివసించే, ఒక బ్రహ్మాండపురుషుని ముఖమండలమా, అన్నట్టువుంటుంది ఆ ప్రకృతివింత. అతని నుదురు ఒక వందఅడుగుల ఎత్తున ఉంటుంది; దానికి తగ్గముక్కు; ఆ పెదవులు ఒక్కమాట మాట్లాడితే, కొండలు పిండి అవుతాయా అన్నంతపెద్దవి. ఈ వివరాలు స్పష్టంగా తెలుసుకోనేందుకు, విగ్రహాన్ని దూరంనుంచి చూడాలిగాని దగ్గిరనుంచి చూడకూడదు; మరీ దగ్గిరనుంచిచూస్తే ఏదో రాళ్లగుట్టలా ఉంటుంది.

ఆదివ్యశిలావిగ్రహ సమక్షంలో పుట్టిపెరిగిన స్త్రీ పురుషులు ఉదాత్తగుణసంపన్నులూ, సత్ స్వభావులూను. వారి హృదయాలలో సహజానురాగం పూటలూరుతుంది. అక్షర జ్ఞానం మాటఎటున్నా, ఆవిగ్రహం వీక్షిస్తూ వుండటమే వారి విద్యాసాధన. ఆదేవుని కనికరంవల్లనే, తమలోయ సుభిక్షంగా ఉంటోందని వారి నమ్మిక.

ఒక తల్లీకొడుకూ తమ ఇంటిగుమ్మందగ్గిరకూర్చొని శిలా విగ్రహాన్నిగురించి మాట్లాడుకుంటున్నారని చెప్పుకున్నాం కదూ! ఆ కుర్రవానిపేరు ఎర్నెస్ట్.

“అమ్మా, అంత గొప్పగా ఉన్న విగ్రహం మాట్లాడగలిగితే, యింకెంత బావుంటుందో. అంత చక్కటిమనిషి ఎక్కడా లేడా, అమ్మా!”

“అటువంటి ముఖంగలమనిషి ఈ లోయలో జన్మిస్తాడట! అది మనప్రజల పురాతన విశ్వాసం!”

“అదేమిటో నాకు చెప్పవ్?” అని అమితోత్సాహంతో అడిగాడు ఎర్నెస్ట్.

వాళ్లమ్మ తనకిచెప్పిన కథ, ఈ తల్లి తన కొడుక్కి చెప్పింది. తను, ఎర్నెస్ట్‌వయసులో ఉండగా, అమ్మ తనకీకథ చెప్పింది. జరిగిపోయిన వాటిగురించికాదు; జరగనున్నదానిగురించిన కథ యిది. ఈ కథని ఎర్నెస్ట్ అమ్మమ్మకి, వాళ్లమ్మచెప్పింది; వాళ్లమ్మకి వాళ్లమ్మచెప్పింది; వాళ్లపూర్వీకులకి, చెట్లఆకులూ కొండకోనలూ, రహస్య సంగీతంలో చెప్పాయట ఈ సంగతి! ఏమైతేనేం, ఆ లోయలోపుట్టిన ప్రతిపిల్లవానికీ, శిలావిగ్రహాన్ని పోలిన పురుషుడు జన్మించనున్నాడనీ, వయసువచ్చాక అతను శిలావిగ్రహంలా ఉంటాడనీ తెలుసు. పెద్దవాళ్లూ చిన్నపిల్లలూ ఈ పురాతనవిశ్వాసంమీద నమ్మకముంచేవారు; కాని, లోకం చూసి, లోకంతెలుసుకొచ్చిన కొందరుమాత్రం, తమకితెలిసిన ఉన్నతాత్ము లెవరిలోనూ ఆ పోలికలులేవనీ, అది మామూలు కట్టుకథ అనీ అనేసేవారు. ఏమైతేనేం, ఆశిలావిగ్రహాన్ని పోలిన మనిషి యింతవరకూ అగుపడలేదు.

"నువ్వు అంతవాడి వవుతావేమో, నాయనా" అంది ఆమె మాతృహృదయం.

కాలం గడుస్తోంది. ఎర్నెస్ట్‌కి ఎప్పుడూ ఆ శిలావిగ్రహాన్ని వీక్షిస్తూ కూచోవాలని ఉండేది. అమ్మకి ఈపనీ ఆపనీలో సాయంచేస్తూ, మిగతావేళల శిలావిగ్రహాన్నిగురించి ఏవో ఏవో ఆలోచించుకుంటూ ఉండేవాడు. పేరుమోసిన విద్యాలయాలలో చదువుకొచ్చిన కుర్రవాళ్ల తెలివితేటలకంటె, యితనిబుద్ధి నిశితంగా తయారయింది. ఆశిలావిగ్రహమే ఎర్నెస్టుకిగురువు. ఆ కుర్రవాడు పగలంతా కష్టపడి, సాయంత్రమయాక, ఆ బ్రహ్మాండ

మైన విగ్రహాన్ని చూస్తూ, తన్మయం పొందేవాడు. ఆ ముఖం తనమీద దయారసం వొలికిస్తున్నట్టు వుండేది. అందరికీ భయంకరంగా కనిపించే శిలాస్వరూపుడు, యితనికి కరుణామూర్తిలా ప్రసన్నమయేవాడు.

ఇలావుండగా, ఆ లోయలో ఒక వదంతిపుట్టింది. శిలా విగ్రహాన్ని పోలిన ఏ మహానుభావునికోసం, లోయలోని ప్రజలు తరతరాలుగా ఎదురుచూస్తున్నారో, ఆ మహనీయుడు ఉద్భవమందాడన్నారు. అతను చిన్నతనంలోనే ఈ లోయనుంచి దూరంగా వెళ్లి, ఒక రేవుపట్నంలో నివాస మేర్పరుచుకు, దగ్గిరున్న కొద్దిడబ్బుతోటీ, చిన్న షాపు పెట్టాడు. అది అతని అసలు పేరో, లేక, పదిమందీ కలిసి పెట్టినపేరో తెలియదుగాని ఆ మహనీయుని గేదర్ గోల్డ్ (స్వర్ణ బంధు) అంటారు. సాహసుడూ నేర్పరీ అవడంవల్ల అందరిచేతా అదృష్టవంతుడనిపించుకున్నాడు. పెద్ద ఓడలకంపెనీ పెట్టి, భాగ్యవంతుడైన వర్తకుడయాడు. ఇతని ధనరాసులు పెంచేందుకు ప్రపంచంలోని దేశాలన్నీ చెట్టాపట్టా లేసుకున్నట్టు తోస్తుంది. ఆర్కిటిక్ ప్రాంతాలనున్న అతిశీతలదేశాలు అతనికి ఫర్సు (**Furs**) పంపేవి; మండుటెండల ఆఫ్రికా అతనికి ఏనుగ దంతాలు యిచ్చేది; ప్రాచ్యదేశాలతనిని పట్టుశాలువాలతో కప్పి, ఆణిముత్యాలూ వజ్రవైఢూర్యాలూ బహూకరించేవి. మహాసముద్రాలతనికి సొరచేపలూ తిమింగలాలూ యిచ్చి,- వాటి నూనెతోటీ చర్మంతోటీ డబ్బుచేసుకో - అనేవి. మైడాస్ కథలోమల్లే, అతను ఏది ముట్టుకున్నా బంగారమయేది; అతను ఎంత భాగ్యవంతుడంటే, అతని సిరిసంపదలు లెక్కించేందుకు వంద

సంవత్సరాలు పడుతుందట. ఇలా వెర్రిగా ధనం సంపాయించిన
మీదట, అతనికి తన జన్మ స్థలానికి తిరిగిరావాలని అనిపించిం
దట. తమలోయలో, తను నివశించడానికి వీలుగా, ఒక బ్రహ్మాండ
మైన కట్టడం నిర్మించేందుకు, యింజనీర్లని ముందుగా పంపాడు.

ఆ శిలావిగ్రహపుపోలిక గేదర్ గోల్డ్‌లో ఉందనీ,
యిన్నాళ్లబట్టి తాము ఎదురుచూస్తున్న మహనీయుడు యితనే
ననీ లోయలోని ప్రజలందరూ అన్నారు. అతను నివశించే భవ
నానికి బయటగోడలుకూడా పాలరాతితో కట్టారు. సూర్య
కాంతిలో ఆభవనం కరిగిపోతుందా అన్నంత అందంగా ఉంది.
తలుపులకి వెండి గడియలు వేశారట; గోడలు గాజుతోకట్టారట;
మిగతావాళ్లు యిత్తడీ యినుమూ ఉపయోగించేచోట్ల, వీరు
వెండి బంగారాలు ఉపయోగించారట. సాధారణంగా ఎవరినీ
లోపలికి రానిచ్చేవారుకాదు గాని, బయటికంటె లోపల యింకా
అందంగా ఉందని చూసినవారన్నారు. ఇక, గేదర్ గోల్డ్ పడక
గదిలోని తళతళలకి, సామాన్యునికైతే వచ్చినా నిద్దరరాదట.

భవన నిర్మాణం పూర్తయింది; కొత్త కుర్చీలు బల్లలూ
నౌకర్లూ, యితర సిబ్బందీ వచ్చారు. సరిగ్గా సూర్యాస్తమయ
సమయాన ఈ మహనీయుడు వస్తాడని కబురు తెలిసింది. ఈ అవ
తారమూర్తి ఎన్నాళ్ళకి దర్శనమిస్తున్నాడో గదా అని, ఎర్నెస్ట్
కూడా ఎదురు చూస్తున్నాడు. అంతటి భాగ్యవంతుడు
ఈ లోయని నందన వనంగా చేయవచ్చు. యిక్కడి ప్రజల జీవి
తాన్ని ఆనందధామంగా చేయవచ్చు. ధనరాసులు దగ్గిరవుంటే,
ఎన్ని మంచిపనులైనా చేయవచ్చు. ఆ మహనీయుడు వచ్చే దారి

దగ్గిర, ఎర్నెస్ట్ ఎన్నో ఆశలలో నుంచున్నాడు. తలఎత్తితే, అతని కెదురుగా కరుణామూర్తి అయిన శిలా విగ్రహామూర్తి ఉన్నాడు. శిలా విగ్రహాన్ని పోలిన మానవుని కోసం, లోయలోని ప్రజలందరికీ మల్లేనే, ఎర్నెస్ట్ కూడా ఎదురు చూస్తున్నాడు. మలుపు చివర నాలుగు గుర్రాలబండీ కనిపించింది.

"అదుగో అదుగో - గేదర్ గోల్డ్ వస్తున్నాడు" అని ఉత్సాహంతో అరిచారు అక్కడ వున్న వాళ్లు

బండి దగ్గిరికి వచ్చింది. బండిలోపల ఒక ముసిలాయన ఉన్నాడు. బంగారం ఎక్కువవడం వల్ల కాబోలు, అతని దేహం కూడా బంగారురంగు దాల్చించి. చిన్న నుదురు, సూదుల్లాంటి కళ్లు, ముఖం నిండా ముడతలు, పల్చటి పెదవులు - అదీ అతని ముఖం తీరు.

"ఆ శిలావిగ్రహపు ప్రతిబింబ మీాయన-అవతారమూర్తి జన్మించాడు," అన్నారు ప్రజలు ఆనందంతో.

కాని, ఎర్నెస్ట్కి ఈ గేదర్ గోల్డ్లో తమ దేవుని పోలికలు ఎక్కడా కనిపించలేదు. "ఇతడా స్వామీా, నిన్ను పోలినవాడు?" అనుకుంటూ ఎర్నెస్ట్ శిలావిగ్రహం వంక దీనంగా చూశాడు. ఆ రాతి పెదవులు, "వస్తాడు, ఎర్నెస్ట్! వస్తాడతను!!" అని అంటున్నట్టుగా తోచిందతనికి.

ఇది ఎర్నెస్ట్ బాల్యంలో జరిగిన సంగతి. ఏళ్ళు గడుస్తున్నాయి. బాలుడు యువ్వనుడయాడు. బాల్యంలోకి మల్లేనే యువ్వనంలో కూడా, పగలంతా కష్టపడి, సాయంత్రంవేళ శిలా విగ్రహాన్ని వీక్షిస్తూ కూచునేవాడు. మిగతా వాళ్ళకి యితని

చోక వైర్రితనంగా కనిపించేది. శిలావిగ్రహం ఎర్నెస్ట్‌కి గురువు అయినట్లు వాళ్ళకి తెలీదు; పుస్తకాలలో వున్నవాటి కంటె ఎక్కువ తెలుసుకో గలుగుతున్నాడు ఎర్నెస్ట్. తనకి సహజంగా వచ్చే ఆలోచనలు, ఎంతో అపూర్వమైనవని, ఆఖరికి ఎర్నెస్ట్‌కి కూడా తెలీదు. అతనిలోని సాధుత్వమే అతనికి వన్నె నిచ్చింది.

ఈ లోగా గేదర్‌గోల్డ్ చనిపోయాడు. తమాషా ఏమిటంటే, అతను చనిపోక పూర్వమే, కథలూ గాథలూగా చెప్పుకున్న ఆ ఐశ్వర్యం, కరిగిపోవడం మొదలెట్టింది. బంగారం చుట్టూ అల్లబడిన అతని కీర్తి, బంగారం తగ్గడంతో అదీ తగ్గ నారంభించింది. బంగారం తరిగి పోవడంతో, ప్రజలకి అతనిలో దివ్య శిలా విగ్రహపు పోలికలు కనిపించడం మానాయి. గేదర్‌గోల్డ్‌ని ఆకాశానికెత్తిన మనుషులు చల్లగా తప్పుకున్నారు. అతను కట్టించిన ఆ భవనం టూరిస్టుల హోటల్‌గా మారింది. గేదర్‌గోల్డ్ విషయం అలా అయింది; శిలావిగ్రహాన్ని పోలిన మనిషి అతను కాదు - అన్నారు లోయలోని ప్రజలు.

కొన్నాళ్ళయే టప్పటికి ఒక సోల్జరులో దివ్య శిలావిగ్రహపు పోలికలు కనిపించాయి. ఈ లోయలో పుట్టి, సైన్యంలో చేరి, ఎన్నో యుద్ధాలలో ఆరితేరిన యుద్ధమూర్తి అనిపించుకున్న ఒక జనరల్, తన జన్మస్థలానికి వచ్చాడు. ఆ జనరల్‌ని, సేనలోవారు, బ్లడ్ - అండ్ - థండర్ అని పిలిచేవారు. ఈ బ్లడ్ - అండ్ - థండర్, గాయాలతోటీ వయసుతోటీ పెద్దవాడై పోయి, మిలిటరీ బాండ్ వినలేక చెవులు చిల్లులుపడిన మీదట, ఆ జీవితం మీద విముఖత కలిగి, తన జన్మస్థలానికి రావాలని ఉందన్నాడు.

ఈ మహా సైనికునికి స్వాగత మిచ్చేందుకు గొప్పగా ఏర్పాటులు చేశారు. తమ జనరల్‌లో దివ్యశిలావిగ్రహపు పోలికలు ఉన్నాయి అని, అటువైపుగా ప్రయాణం చేస్తున్నప్పుడు, అతని సైనికులలో ఒకతను అన్నాడట. ఇంకేముంది? ఆ మాట రెక్కలుగట్టుకు ప్రయాణం చేసింది. లోయలోని వారందరూ ఈ జనరల్‌కి ఘన స్వాగత మిచ్చేందుకు సంసిద్ధులయారు. ఎట్టకేలకు, తమ అవతారమూర్తి దర్శన మిచ్చినందుకు, వారి ఉత్సాహం కట్టలు తెగి ప్రవహించింది.

ఆ ఉత్సవంలో అందరితోబాటు ఎర్నెస్టు కూడా పాల్గొన్నాడు. మహాసేనానికి యిస్తున్న విందులో, రివరెండ్ డాక్టర్ బాటిల్‌బ్లాస్ట్, బ్రహ్మాండంగా ఉపన్యాసం యిచ్చాడు. పూలమాలలతో అలంకరింపబడ్డ ప్రత్యేక వేదికమీద జనరల్‌ని కూచోబెట్టారు. దివ్య శిలావిగ్రహాన్ని పోలిన ఆ మహామహుని కనుల పండుగగా చూసేభాగ్యం లభిస్తోందేమో నని, గుంపులో ఉన్న ఎర్నెస్ట్ బొటనవ్రేళ్లమీద నుంచుని, కొంగలా మెడచాచినప్పటికీ కూడా, ఆ మహామహుని దర్శనం కాలేదు. నిస్పృహాతో దివ్య శిలావిగ్రహంవైపు చూసేటప్పటికి, అది ఎప్పటికి మల్లేనే తన వంక సానుభూతికనుబరుస్తూ చిరునవ్వు నవ్వుతోంది. ఎర్నెస్ట్ పక్కగా ఉన్న మనుష్యులు ఎంతో సంతోషంతో అంటున్నారు.

"అదే మొహం. ఆఖరికి తలవెంట్రుకలుకూడా దివ్యశిలా విగ్రహపు తలవెంట్రుకల్లా ఉన్నాయి," అన్నాడొకతను.

"మనం నమ్మలేనంత పోలిక కనిపిస్తోందినుమా!" అన్నాడు యింకొకతను.

"పోలికలంటారేమిటి? అతను అక్షరాలా అవతార మూర్తే_అందుకు సందేహంలేదు. ఇటువంటి మహావీరుడు యింతవరకూ జన్మించి వుండడు," అన్నాడు మూడో మనిషి.

ఈ ముగ్గురూ దబ దబా చప్పట్లుకొట్టారు; వీరి కరతాళ ధ్వనులని మిగతావారు అందుకున్నారు. కొన్నివేల కంఠాలు జయ జయధ్వానాలు చేశాయి. మిన్నుముట్టిన ఆ జయనాదం దివ్యశిలావిగ్రహావు నిశ్వాసంలావుంది. భూలోకంమీద జన్మించే ఆ అవతారమూర్తి, యిటువంటి యుద్ధవీరుడై ఉంటాడని, ఎర్నెస్ట్ భావించలేక పోయాడు; అతను శాంతస్వరూపుడూ, వివేకవిజ్ఞానాలకి నిలయుడూ, మంచిపనులు చేసే నిరాడంబరుడూ అయివుంటాడని ఎర్నెస్టు తలపోస్తూ వచ్చాడు. "ఏమో ఎవరు చెప్పగలరు? ఖడ్గధారి అయిన మహాసేనాని మట్టుకు మానవ జాతికి మంచిని సమకూర్చలేదా? భగవంతుని చిద్విలాసం మానవులు తెలుసుకోలేరు," అని సరిపెట్టుకున్నాడు ఎర్నెస్టు.

జనరల్ మాట్లాడుతున్నాడని తెలియగానే, అందరూ నిశ్శబ్దం వహించారు. జనరల్ నుంచున్నాను. అప్పుడు చూడగలిగాడు ఎర్నెస్టు ఆ మహాసేనానిని. మిలిటరీ గౌరవ లాంఛనాలతో, మెడల్సుతో మనిషి ఎంతో పటాటోపంగా ఉన్నాడు. అందరికీ అతనిలో దివ్యశిలావిగ్రహావు పోలికలు కనిపించాయిగాని, ఎర్నెస్టుకి ఎంచేతనో కనిపించలేదు. యుద్ధభూమిలోని కష్టాల కోర్చిన యినుపమనిషి ఈ జనరల్; అతనిలో రాటుసపట్టు వున్న మాట నిజమే; కాని, శిలామూర్తిలోని సామ్యతా సౌజన్యమూ యెక్కడలేవే!

"ఆ అవతారమూర్తి యితనై ఉండదు. శిలావిగ్రహాన్ని పోలిన మనిషి ప్రభవించేందుకు యింకా చాలా కాలం పడుతుంది కాబోలు!" అనుకున్నాడు ఎర్నెస్టు.

పర్వత శిఖరాల మీదవున్న మబ్బులు దూరంగా కదలడంతో శిలావిగ్రహాపు ముఖం ఎర్నెస్టుకి యింకా బాగా కనిపించసాగింది. ఆ దేవుడు నిజంగానే నవ్వుతున్నాడా అనే భ్రమకలిగింది ఎర్నెస్టుకి. రాతి పెదవులు కదలకపోయినా ఆ ముఖంలో చిరునవ్వు ద్యోతకమవుతోంది. పడమటి కిరణాలు మబ్బులమీద పడి, ఆ భావం కలిగిస్తున్నాయి. ఎర్నెస్టుకి ఈ శిలామయదివ్య విగ్రహామూర్తి స్నేహితులందరినీ మించిన ఆత్మస్నేహితుడు.

"ఎర్నెస్ట్ — అతనువస్తాడు! రాకపోడు. విచారించకు. అతను వస్తాడు," అని చెబుతోంది ఆవిగ్రహాం.

మరికొన్ని సంవత్సరాలు ప్రశాంతంగా దొర్లిపోయాయి. యువ్వనంనుంచి మధ్యవయసులోకి వచ్చాడు ఎర్నెస్టు. కష్టపడి పనిచేసే మంచివాడుగా చుట్టుపక్కలవారిలో పేరుతెచ్చుకున్నాడు. 'ఎర్నెస్టా? అతను చాలామంచివాడు!' అనేవారు అతన్ని తెలిసిన వాళ్లందరూ. అందరూ ధన ధాన్యాదులకోసం ప్రాకులాడితే, యితను మంచిగా ఉండేందుకు శ్రమపడేవాడు. అతని ప్రశాంత జీవితంలో సుఖశాంతులే గాని వొడుదుడుకులు లేవు. తనమార్గం నుంచి ఒక్క అడుగు అవతలకి వేసేవాడు కాదు. అనుకోకుండానే అతను బోధకుడు (Preacher) అయాడు. ఆలోచనా క్రమంలోని విశాలపట్యాం వల్ల పరమసత్యాలు అతనినోటినుంచి వెలువడుతూండేవి; ఆ మాటలు విని కొందరు తమ జీవితాలు మార్చుకో

గలిగారు. ఆ వినేవాళ్లకి ఎర్నెస్టు తమతోటి వాడనీ, తమలో ఒకడనీ తెలుసు; కొండకోనలోని పవిత్ర జలంలా అతనినోటివెంట సత్యవాక్కులే వెలువడుతాయనీ వాళ్లకి తెలుసు.

గేదర్ గోల్ లోకి మళ్లేనే మహాసేనానిలో కూడా దివ్య శిలావిగ్రహపు పోలికలులేవని తెలుసుకునేందుకు ఆ లోయలోని ప్రజలకి ఎంతోకాలం పట్టలేదు. వాళ్లిద్దరూ కాదు, దివ్యశిలా విగ్రహంలాటి మనిషి, మరొకచోట వున్నాడు, అని పత్రికలలో వార్తలు వెలువడ్డాయి. అతను ఐశ్వర్యవంతుడూ కాదు; ఖడ్గధారీ కాదు. గొప్పవక్త. అతని వాగ్ధోరణి అద్భుతమైనది; అతని మాటలు మంత్రాల్లా పనిచేస్తాయి. అతని దగ్గర సమ్మోహనాస్త్రం ఉంది. చీకటిని కాంతిగానూ, కాంతిని చీకటిగానూ చేయగలడు. అతనికంఠంనుంచి పిడుగులు పడతాయి. యుద్ధనృత్యముచేస్తూ, శాంతిగానము పాడగలదా కంఠం. ఈ దేశంలో, యితరదేశాలలో, రాజాంతఃపురాలలోనూ పార్లమెంటు భవనాలలోనూ, రాజుల ముందూ ప్రజానాయకులముందూ తన మాటలతో మన్నన పొందిన మహానుభావుడితను. ఈ సారి ఎన్నికలలో అతనిని ప్రెసిడెంట్ గా నిలబెడదా మనుకుంటున్నారు. అతని అనుచరులకి అతనిలో దివ్యశిలావిగ్రహపు పోలికలు కనుపించాయి. అంచేత, ఎన్నికలకి ముందు, జన్మస్థలమైన ఈ లోయలో పర్యటనసాగించడం, రాజకీయదృష్ట్యా లాభదాయకమని భావించారు. కాబోయే ప్రెసిడెంట్ కి వోల్డుస్టోనీఫిజ్ (Old Stony Phiz) అని పేరుపెట్టారు.

ఈ రాజకీయ నాయకునికి బ్రహ్మాండమైన స్వాగతం ఏర్పాటు చేయబడింది. గుర్రపురౌతులూ, మిలిటరీ ఆఫీసర్లూ, ప్రభుత్వోద్యోగులూ, పత్రికాధిపతులూ, పెద్ద పెద్ద లందరూ బారులు తీర్చి నుంచున్నారు. వోర్డ్ స్టోనీఫిజ్ చిత్రపటమూ, దివ్య శిలావిగ్రహపు చిత్రపటమూ - యిద్దరూ అన్నదమ్ము లన్నట్టు పక్కపక్కగా ఉంచి, ఊరేగించారు. ఆ నాటి బాండు వాయిద్యంతో పర్వతాలు ప్రతిధ్వనించాయి; తనని పోలినవాడు ఈ భూమిమీద అవతరించినందుకు, ఆఖరికి ఆ దివ్యశిలావిగ్రహమే ఆనందిస్తోందా అన్నట్టుగా ఉంది ఆ అట్టహాసం.

అందరూ జయజయధ్వానాలు చేస్తూంటే, ఎర్నెస్ట్ కూడా ఆ సంతోష సాగరంలో కలిసిపోయాడు.

ఎట్టకేలకు ఆ మహామహుని దర్శనమయింది.

"చూడు, చూడు - అతను దివ్య శిలామయ దేవుని ముద్దర అంటే నమ్ము. ఇద్దరూ కవలల్లా ఉన్నారుగదా!" అన్నాడు అక్కడి గుంపులో ఒకతను.

"శిలామూర్తే యిలా అవతరించాడు; అందులో సంశయం లేదు," అన్నాడు యింకొకతను.

మొట్టమొదట చూసినప్పుడు, ఎర్నెస్ట్ కూడా దివ్యశిలా విగ్రహానికీ ఈయనగారికీ పోలికలు వున్నాయేమో - అనుకున్నాడు. పైకి, ఇద్దరి నుదురూ ఒకేవిధంగా ఉంది. కాని విగ్రహంలో ఉండే ఈశ్వరాంశ, ఈ మానవుని ముఖంలో లేదు. రాజకీయనాయకుని ముఖంలో ఆనందంకంటె వేదన ఎక్కువ;

లోతుకుపోయి, కాంతి విహీనంగా కనిపించే ఆ కళ్లు, పారేసుకున్న ఆటవస్తువుల కోసం వెతుకుతున్నట్లు వున్నాయి. వాస్తవం కాని వాటికోసం ఆక్రోశించే అతని బ్రతుకు, పదార్థంలేని వోటికుండ.

"ఎర్నెస్టు, ఎర్నెస్టు - అతనిలో దివ్యశిలావిగ్రహాపు పోలికలు వున్నాయికదూ?" అని అడుగుతున్నారు పక్కల నున్న వాళ్ళు.

"చెప్పు, చెప్పు" అనివేధించసాగారు ఎర్నెస్టుని.

"నాకు కనిపించడం లేదు," అన్నాడు ఎర్నెస్టు.

"అయితే అది ఆ దివ్యశిలావిగ్రహాపు దురదృష్టం; మా వోల్డు స్టోనీఫిజ్ ప్రెసిడెంటు అవడం ఖాయం," అన్నాడొక ఉత్సాహవంతుడు.

నిరుత్సాహంతో నిస్పృహతో ఎర్నెస్టు అక్కడి నుంచి వెళ్ళిపోయాడు. మనుషులు లేనిచోటుకి వెళ్లి, దివ్యశిలావిగ్రహం వంక దీనంగా చూశాడు: "అయ్యో, నాయనా, ఆ అవతార మూర్తి కోసం నీకంటె నేను ఎక్కువగా ఎదురుచూస్తున్నాను. అతను తప్పకుండా వస్తాడు - నువ్వు విచార పడకు," అన్నట్లుగా సందేశం చెప్పాయి ఆ దివ్యవిగ్రహాపు పెదవులు.

కాలచక్రం గిరగిర తిరుగుతోంది. ఏళ్లు ఒకదానివెంట ఒకటి పరుగెత్తుకుంటూవస్తున్నాయి. ఎర్నెస్ట్ తల తెల్లపడింది; నుదుటిమీద రేఖలూ, ముఖంమీద ముడతలూ ఏర్పడ్డాయి. అతను పెద్దవాడయాడు; అది వృధాఅయేపెద్దతనంకాదు తన అనుభవంలోని సత్యాలు కథలుగాఅల్లి, ప్రజలకి చెబుతున్నాడు;

ప్రజల కరదీపకవిధంగా జ్ఞానదీపిక అయింది. ఎర్నెస్ట్ పేరు ఈనాడు పదిమందికీ తెలుసు. ఆ కీర్తిరేఖలు అతను కావాలని కోరుకున్నవి కాదు. వాటంతటవే వరించివచ్చాయి. లోయలోని ప్రజలకే గాక, దూరానవున్న పండితులకీ, రాజకీయవేత్తలకీ, తత్వజ్ఞాన సంపన్నులకీ ఎర్నెస్టుఅంటే ఎనలేని అభిమానం. తమసంశయాలు తీర్చుకునేందుకు, ఆయనదగ్గిరికి పనిగట్టుకు వస్తూండేవారు. అతని సత్యసంధత వారిని ముగ్ధపరిచేది. ఎర్నెస్టు మహాగ్రంధాల చదువు కున్నవాడుకాదు; కాని, బాల్యంనుంచీ ఆత్మశుద్ధినేర్చుకు, దివ్య శిలావిగ్రహ సమక్షంలో పెరిగినవాడు. అంచేత, అతని నిజాయితీ వారిని ఆశ్చర్యపరిచేది. అతనితో మాట్లాడి వస్తూ వస్తూ, ఆ దివ్యవిగ్రహం విస్మయానందంతో పరికించి, అటువంటిముఖం ఎక్కడ చూశామా అనుకుంటూండేవారు ఆ పండిత ప్రకాండులు.

ఎర్నెస్ట్ బాగా పెద్దవాడయాడు; అతనికి ముసలితనం వచ్చింది. అటువంటి సమయంలో ఒకమహాకవి జన్మించాడు ఈ భూమిమీద. ఆ కవిపుంగవుడుకూడా ఈ పర్వతలోయకి చెందిన వాడే! కాని, అతను పట్నవాసంపోయి, అక్కడిరొదలో ఉంటూ పద్యాలూ పాటలూ రాసేవాడు. పట్నంలో ఉంటున్నప్పటికీ, బాల్యవయసులో మనోముద్రితములైన మంచుకొండలూ, దివ్య శిలావిగ్రహమూ కొండవాగులూ అతను మర్చిపోలేకపోయే వాడు; అవి అతని కవిత్వంలో కనిపిస్తూండేవి. అతను పర్వతం గురించి పాట అల్లితే, ఆ పర్వతం మనకళ్లముందు కనిపించేది. ఒక సరస్సుగురించి చెబితే, ఆ సరస్సు పువ్వులతో బాటు మన

ముందుకొచ్చి చల్లగా నవ్వేది. మాధుర్యంతో తొణికిసలాడే అతని కవితాశక్తి అపూర్వం. తనగురించి లోకానికి చెప్పేందుకు సృష్టి, ఈకవిని సృష్టించిందా, అన్నంత చక్కగా చెప్పేవాడు.

ప్రకృతిపట్ల మాధుర్యం వొలకబోస్తే, మానవులపట్ల అమృతం చిలికించేవాడు ఆ మహాకవి. నడిరోడ్డుమీద కనిపించే సామాన్యవనిత, మట్టితో ఆడుకునే సామాన్యబాలుడూ అతని కవితాస్రవంతిలో కరిగి, అమరులయారు. సమస్తజీవరాసీ అతని కవితావేశంలో సౌందర్యరూపం దాల్చింది.

అతనిపాటలు ఎర్నెస్టు చెవినిపడ్డాయి. ఆ పాటలుచదివి అతను అమందానందం పొందాడు. ప్రతిపాదమూ అతని వొళ్లు పులకరింపజేసేటప్పటికి, కృతజ్ఞతతో రాతివిగ్రహంవంక చూశాడు ఎర్నెస్టు.

"బహుశా, ఈ మహాకవి నిన్నుపోలినవాడై వుంటాడు," అన్నాడు ఎర్నెస్టు.

దివ్యశిలావిగ్రహం జవాబుచెప్పక చిరునవ్వునవ్వినట్లు తోచింది.

ఆ కవి ఎర్నెస్టుగురించి ఎంతగానో విన్నాడు. ఎర్నెస్టు వంటి పూజ్యపాదుని దర్శించి తనజీవితం ధన్యంచేసుకొనేందుకు గాను ఒకరోజున బయలుదేరాడు. ఒకప్పుడు గేదర్‌గోల్డ్ భవనమైన హోటల్లో మకాంచేసి, ఒకచిన్నసంచీ బుజానవేసుకు, ఎర్నెస్టుయింటికి వచ్చాడు ఆ కవి.

గుమ్మం దగ్గిరికి వచ్చేటప్పటికి ఆ ముసలాయన కనిపించాడు; ఏదో పద్యకావ్యం చదువుకుంటూ, మధ్య మధ్య శిలావిగ్రహం వంక ఆశ్చర్యంతో చూస్తున్నాడు.

"నమస్కారం, ఈ పూటకి మీ యింట్లో నాకు బస దొరుకుతుందా?" అన్నాడు కవి.

"నిక్షేపంగా - దానికేం!" అన్నాడు ఎర్నెస్టు.

కవి, ఎర్నెస్టు సరసనికూచుని మాటలు ప్రారంభించాడు. అందమైన ఛలోక్తులతో నాజూకుగా మాట్లాడటంలో ఆ కవి ఘనుడు. ఎర్నెస్టుని చూడగానే అటువంటి కవచాలు అనవసర మనిపించిది కవికి. మనసులో ఉన్నది ఉన్నట్టు చెప్పవచ్చు; చెప్పదలుచుకున్నది, మిగతా సభ్యప్రపంచంలో చెప్పినట్టు, అష్ట వంకరలతో చెప్పక్కర్లేదు. మహాకావ్యాలు మామూలు మాటల్లో మాట్లాడారు ఆ మహానుభావులిద్దరూ.

"నీపేరేమిటి, నాయనా?" అని అడిగాడు ఎర్నెస్టు.

ఎర్నెస్టు చేతిలోవున్న పద్యకావ్యంపైపు వేలుపెట్టిచూపించాడు ఆ కవి.

"ఈ గేయాలు నువ్వుకూడా చదివావా?" అని అడిగాడు ఎర్నెస్టు.

"చదవడంకాదు - అవి రాసినది నేనే!" అన్నాడు కవి.

ఎర్నెస్టు అతనిముఖం వంక పరిశీలనగా చూశాడు. దివ్య శిలావిగ్రహాన్ని పోలినమనిషి, యితనే అయివుంటాడనుకున్నాడు. మరోసారి పరిశీలనగాచూసి విచారవదనుడయాడు ఎర్నెస్టు.

"మీా రెండుకలా అయారు?" అని అడిగాడు కవి.

"ఒకజోస్యం నిజమవుతుందని, నాజీవితకాలమంతా ఎదురుచూశాను. ఈ పద్యకావ్యం చదివాక, ఆ జోస్యం నీ ద్వారా నిజమవుతుందను కున్నాను."

"శిలావిగ్రహపు దేవుని పోలినమనిషికోసం మీారు ఎదురు చూసి నిరుత్సాహం పొందారు. గేదర్ గోల్డ్, బ్లడ్ - అండ్ - థండర్, వోల్ ప్టాసీఫిజ్ మిమ్మల్ని నిరుత్సాహపరిచినట్లే, నేనూ మిమ్మల్ని నిరుత్సాహపరిచివుంటాను. నాకు తెలుసాసంగతి. ఆ ముగ్గురు మహనీయులతోబాటు, నన్నుకూడా కలపండి. మీా చిరకాలవాంఛితం మరోకసారి మోసపోయింది. మహాపురుషా, ఆదేవునితో పోల్చగలిగినంతటి గొప్పవాణ్ణానేను? అందుకు తగను ఈ అల్పుడు!"

"ఏం? నీ భావనావీచికలలో భగవదంశ కనిపిస్తున్నప్పుడు, నువ్వు తగకపోవమేమిటో?" అని ప్రశ్నించాడు ఎర్నెస్టు.

"అంతరిక్షాన్నంటే గానమాధురిలో ఈశ్వరవాక్కు కొద్దిగా ఉండేమాట నిజమే! కాని, నా జీవితానికీ నాభావనకీమధ్య ఎంతటి అఖాతముందోకదా! నావన్నీ స్వప్నాలు, బంగారు స్వప్నాలు. భావన స్వప్నాంచలాల విహరించింది గాని బతుకు క్షుద్రత్వంలో గడిచింది. నేను గానంచేసే ఈ అద్భుత సౌందర్య సౌజన్యాలకి వెనక 'నిజవిశ్వాసం' ఉన్నదా అని నాకే అను మానంగా ఉంటుంది అప్పుడప్పుడు. నాఊహాలు ప్రకృతిపరంగా నిజమేమోగాని, మానవజీవితంలో నిజంకావేమో! సత్యాన్వేషీ

పాన్ని సౌజన్యధర్మాన్ని అన్వేషించే మహామనవుడు, నాలో శిలావిగ్రహమూ ర్తిపోలిక ఉండగలదని భావించడమేమిటి - నా దురదృష్టంగాని !”

కవి దీనాతిదీనంగా మాట్లాడాడు. అతని నేత్రాలు అశ్రుపూరితములయ్యాయి. ఎర్నెస్టు కళ్ళలో కూడా అశ్రువులు నిలిచాయి.

సూర్యాస్తమయ సమయమయింది. ఎర్నెస్టు తన దైనందిన ప్రబోధం చెప్పేందుకు వెళ్ళవలసినవేళ అది. అతనూ, కవీ ఈమాట ఆమాట చెప్పుకుంటూ వేదిక చేరుకున్నారు. కొండల మధ్య నున్న ప్రశాంత ప్రదేశమది. పెద్ద బండరాయి ఒకటి ఉందక్కడ. దాని చుట్టూ పూలచెట్లు అల్లిబిల్లిగా అల్లుకున్నాయి. ప్రకృతి తనంతట తానుగా ఈ పూలపందిర అమర్చిందా అన్నట్టు వుంది. ఎర్నెస్టు వెళ్లి ఆ రాతిమీద కూర్చున్నాడు, అతని పక్కనే ఉన్నాడు కవి. ఎర్నెస్టు చెప్పే మంచిమాటలు వినడానికి వచ్చిన ప్రజలు ఆ చుట్టూతా, ఎవరి వీలుని బట్టి వారు కూచున్నారు.

ఎర్నెస్టు మాట్లాడటం మొదలెట్టాడు. అతని మనసులో ఉన్నది చెప్పాడు. ఆ మాటల వెనక ఆత్మశుద్ధీ భావనాబలమూ ఉండటం వల్ల, అవి తిన్నగా ప్రజల హృదయ ప్రాంగణంలోకి చొచ్చుకు పోయేవి. పవిత్రప్రేమతోటీ, పవిత్ర కార్యాలతోటీ చైతన్యవంతములైన వాక్కులవి - కల్తీలేని మంచి ముత్యాలు. ఆ మాటలు వింటూంటే కవిహృదయం మాటలకందని కవితా

వేళంతో పరవళ్లు తొక్కింది. ఆ పూజ్యమూర్తిని సజల నేత్రాలతో చూస్తూ, ఆ మహనీయునికి మనసులో ప్రణమిల్లాడు కవి. కొంచెం దూరంలో, సూర్యాస్తమయ కాంతుల బంగారు తళతళలో, ఆ దివ్య శిలావిగ్రహం ఈ సమస్త ప్రపంచాన్ని ప్రేమ పూరిత వీక్షణాలతో పునీతం చేస్తోంది.

ఆ దివ్యశిలావిగ్రహాన్నే, ఈ ఎర్నెస్టునీ చూసేటప్పటికి, కవికి జ్ఞానోదయమైనట్టయింది. నోటినుంచి వచ్చేపాట నాపుకో లేక, రెండు చేతులూ పైకెత్తి, "చూడండి, చూడండి_ఆ శిలా విగ్రహాన్ని పోలిన పూజ్యమూర్తి ఈ ఎర్నెస్టు" అన్నాడు.

ప్రజలందరూ ఆ దేవునీ ఈ దేవునీ ఒక్కసారి చూసి, ఆనందబాష్పాలు రాల్చారు. జోస్యం నిజమయింది. కాని, ఎర్నెస్టు ఆ పూటకి వేదిక దిగి కవి వెంటనడుస్తూ, తన కుటీరం చేరుకున్నాడు; దివ్యవిగ్రహాన్ని పోలినవాడు యింకా రాలేదనే ఎర్నెస్టు అనుకోవడం.

# ఎలుగు బంటి

## విలియమ్ ఫాక్‌నర్

(1897– )

ఆక్స్‌ఫర్డువద్ద మిసిసిపీ రాష్ట్రంలోని న్యూ ఆల్బనీలో జన్మించాడు. బాల్యంనుంచీ ఈ మిసిసిపీ విశ్వకళాపరిషత్తే ఇతనికి నివాసమైనది. అతి బాల్యంలోనే ఈ విశ్వకళాపరిషత్తును వదలి మొదటి ప్రపంచ యుద్ధంలో, కెనడియన్ విమానదళంలో చేరి, విమానప్రమాదంలో గాయపడి న్యూ ఆర్లియన్సు చేరుకున్నాడు. అక్కడ షెర్‌వుడ్ ఆండర్సన్‌తో కలిసివుంటూ, పత్రికలకి కథలూ అవీ రాస్తూండేవాడు.

ఆ తర్వాత న్యూయార్క్ వెళ్లాడు; యూరప్ చూసి వచ్చాడు; కొన్నాళ్లు ఆక్స్‌ఫర్డులో బొగ్గు కార్మికునిగా పని చేశాడు. ఇచ్చటనే ఇతను గొప్పనవలలు రచించాడు. 1931 నుంచి, రచనలవల్ల తనను తాను పోషించుకోగల స్థితికివచ్చాడు. 1939 లో ఓ హెన్రీ మెమోరియల్ పారితోషికంతో సారస్వత గౌరవం లభించింది; 1949 లో నవలా కారుడిగా నోబుల్ ప్రయిజ్ పొందాడు నేషనల్ ఇన్‌స్టిట్యూటు ఆఫ్ ఆర్ట్సు అండు లెటర్సుకు సభ్యుడుగా ఎన్నుకోబడ్డారు.

# ఎ లు గు బ ం టి

అతనికి పదేళ్లు. ఆ అబ్బాయి తనవయసు రెండు అంకెలలో రాసుకోవడమయ్యాక వాళ్ల నాన్నతోటీ, మేజర్ డిస్పెయిన్ తోటీ, జనరల్ కాంప్సన్‌తోటీ 'కాంప్'కి వెళ్లాడు; వేటకని వేసుకునేవాళ్ల గుడారాలు చూశాడు. నాన్నావాళ్లూ నవంబరులో రెండు వారాలపాటూ, జూన్‌లో రెండువారాలపాటూ ఆ విధంగా వెళ్తూండేవారు. పాదం మశలబడ్డ ఆ పెద్ద ఎలుగుబంటి గురించినకథ, అతను ఏనాడో విన్నాడు. చుట్టుపట్ల వందమైళ్లలో ఏ ప్రాణికీ లేని పేరు ప్రఖ్యాతులు వున్నాయి ఆ ఎలుగుబంటికి.

దానిగురించిన అపూర్వమైన విషయాలు ఎన్నో విన్నాడు ఆ కుర్రవాడు. పెద్దపెద్ద పందుల్ని, లేగదూడల్ని అది బరాబరా అడవిలోకి ఈడ్చుకుపోతుందట. ఎన్నివుచ్చులువేసినా, ఎన్ని వలలు పన్నినా అది యిట్టే తప్పించుకుంటుందట. ఎన్ని వేటకుక్కలని అది చంపేసిందో లెక్కచెప్పవేం. తిన్నగా తుపాకీ గుళ్లుకాలిస్తే, చిన్నపిల్లమీద చింతగింజలుపోసినట్టు, అది దులుపుకువెళ్లిపోతుందట. దానివేగంచెప్పతరం కానిది.

కళ్లతో చూడటానికి మునుపే ఆ ఎలుగుబంటిగురించి ఎంతో తెలుసు ఆ అబ్బాయికి. తనమీదకొచ్చే వేటకుక్కల్ని విసిరేస్తూ, తనమీద స్వారీచేద్దామనుకున్న గుర్రాల్ని తరిమి కొడుతూ, తనని తుపాకులతో భయపెట్టే మనుషుల్ని తూలనాడుతూ, ఎర్రటికళ్లతో, పెద్దగా, మరీపెద్దగావుండే ఆవృద్ధ

ఎలుగుబంటి అతని కలలలో ఎన్నోసార్లు కనిపించింది. అది చూపులకి పెద్దదన్నమాటేగాని దానిలో క్రౌర్యంలేదు. ఉన్న స్థలంచాలని మనుషులు, అరణ్యాలమీదపడి, అక్కడిచెట్లూ చేమా తమగొడ్డళ్లతో పడగొడితేగాని వూరుకోరు. అసలు మనుషులకి అడవులంటేనేభయం. తమదైన ఈ అటవీప్రాంతంలో, తమని ధిక్కరించి బతికే ఒకప్రాణి ఉండటం వారికెంతచిన్నతనం. మత్తుగా ఆవలిస్తున్న ఏనుగుపాదాలదగ్గిర అల్లరిచేసే అంగుష్ట మాత్రుల్లా కనిపించేవారు - ఆ వృద్ధ ఎలుగుబంటికి ఈ మానవులు !

అతనికి పదేళ్లువచ్చేదాక, ప్రతినవంబరులోనూ, వేట కుక్కలూ, పక్కబట్టలూ, ఆహారసామగ్రీ, తుపాకులూ గల పెద్దబండీ (వాగన్) తమయింటిదగ్గిరనుంచి బయలుదేరడంచూసే వాడు. తన తండ్రివెంట సీగ్రోజిమ్, సామ్‌ఫాదర్స్‌కూడా వెళ్లే వారు. వారంతా మొట్టమొదట జెఫర్సన్‌నగరం చేరుకునేవారు; అక్కడ మేజర్ డిస్పెయిన్ మిగతావారూ వారితో కలిసేవారు. ఏడు, ఎనిమిది, తొమ్మిది సంవత్సరాలప్పుడు ఆ అబ్బాయి, వాళ్లందరూ ఆ ఎలుగుబంటిని చూడడానికి వెళ్తున్నారు గాని చంపడానికికాదు - అని అనుకునేవాడు. రెండువారాలయాక వాళ్లు తిరిగి వచ్చేవారు. తనకి పదేళ్లువచ్చాక, తండ్రి తనని కూడా వేటకి తీసుకువెళ్తాడని ఆ కుర్రవానికి మనసులో తెలుసు. అలానే జరిగింది.

మొట్టమొదటి కాంపు అనుభవంలో రెండవవారమది. కుక్కల అరుపు వినిపించింది. సామ్‌ఫాదర్సూ, ఆ పదేళ్ళ బాలుడూ

ఒక సిందూరపుచెట్టుకి చేరగిలబడి నుంచున్నారు. ఇప్పటికితొమ్మిది రోజులబట్టీ ప్రతి ఉదయం వారక్కడనుంచుంటున్నారు; గడిచిన వారంలో ఒకరోజున యిలాగే కుక్కల అరుపులు విన్నాడతను. తుపాకీఎత్తి సిద్ధంగా నుంచున్నాడు; దూరంగా, దుప్పులూ చెవులపిల్లులూ గుంపుగా ఛటాలున పరుగెత్తి చెట్లలో కలిసి పోవడం కనిపించింది; ఆ తర్వాత కుక్కల అరుపులుకూడా ఆగి పోయాయి.

"ఇక, తుపాకీ దించండి, చిన్నఅయ్యగారూ!" అన్నాడు సామ్.

"అవి యిటువైపురావని నీకు తెలుసా?"

"రావు," అన్నాడు సామ్.

పదోరోజు ఉదయం మళ్లీ కుక్కలఅరుపులు వినిపించాయి. ఆ అబ్బాయి తుపాకీ సిద్ధంచేసిపట్టుకున్నాడు. ఈసారిదుప్పులూ కనిపించలేదు; సీమకుందేళ్లూ కనిపించలేదు. మరికొంచెంసేపటికి ఒక పెద్ద ఆకారం, గాలిలో ఊగుతూ, దూరంగా కనిపించింది.

"కదలవద్దు" అన్నాడు సామ్, ఆకుర్రవానితో. సామ్ ఫాదర్స్ వేడి ఊపిరి బాలునికి తన బుజాలమీాద తెలుస్తోంది.

"పరిగెత్తనుకూడా పరిగెత్తడంలేదు. నడుస్తోంది."

"పెద్దఎలుగుబంటి యిదేకదూ!" అని అడిగాడు కుర్ర వాడు.

"అవును; ప్రతిసంవత్సరం ఒకసారి కాంపుదగ్గిరికివచ్చి, చూసి వెళ్తూంటుంది. దానిని పట్టుకోగల వేటకుక్క యింతవరకూ పుట్టలేదు. మనం తొందరగా కాంపుకిపోదాం," అన్నాడు సామ్.

వారు కాంప్ చేరుకునే టప్పటికి, పదివేలుకుక్కలు రొప్పుతూ పడిఉన్నాయి. వాటికళ్ళలోనిబాధ, ఆమూలుగు చెప్పతరంకాదు. మిట్టమధ్యాహ్నంవేళ, పదకొండో కుక్కకూడా, అదే స్థితిలో వచ్చింది.

ఆ మధ్యాహ్నం సామ్ ఫాదర్సూ, ఆ అబ్బాయీ కంచర గాడిదమీద బయులుదేరి, కొత్తదారమ్మట మూడుగంటలసేపు ప్రయాణంచేసి, ఒకచోటుకి వచ్చారు. నేలకొరిగినచెట్టు మ్రాను పక్కగా, పెద్దదైన పాదాలగుర్తు కనిపించింది. కుఱ్ఱవానికి అప్పుడు యింకా బాగా అర్థమయింది. ఇన్నాళ్ళబట్టీ ఆ పెద్ద ఎలుగుబంటి ఉనికి తన తండ్రీ వాళ్ళకీ తెలియదన్నమాట. స్థల పరీక్ష అయాక సామ్ఫాదర్సూ అతనూ కాంపుకి వెళ్ళిపోయారు.

మర్నాడువుదయం సూర్యోదయ మింకామూడుగంటలకి అవుతుందనగా, గుఱ్ఱాలబండిమీద బయలుదేరారు. తెల్లారే వేళకి మరొక కొత్తప్రదేశంలోకి వచ్చారు. మేజర్ గారి పెద్ద తుపాకీ ఆ కుఱ్ఱవానికి యిచ్చి, ఫలానాచోట ఆ అబ్బాయిని వుండమని సామ్ఫాదర్స్ మరొకవైపుగా వెళ్ళాడు. ఒక తుమ్మ చెట్టుకి పక్కగా నిలబడ్డాడు ఆ బాలుడు.

పదిరోజులబట్టి ప్రతి ఉదయం ఆ విధంగా నుంచుంటున్నాడు- ఏదో సంభవించాలని: ఆ సంభవించనున్నదానికి ఎదురుచూస్తూ నుంచోవడం. గుండెలు పిండే అర్థరహితమైన ఏకాంతమిది. మానవ హృదయంలోని ఈ ఏకాంతాన్ని భరించలేకనో కాబోలు, మనుషులు రకరకాల పిచ్చిపనులు చేస్తారు; ఆ ఏకాంతం అలా పోయేది కాదు.

ఆ కుర్రవానికి కుక్కల అరుపులు వినిపించలేదు. వడ్రంగి పిట్ట చేసేచప్పుడు తప్ప యింకేమీ వినిపించడంలేదు. ఎలుగుబంటి తనని చూస్తూన్నట్టనిపించింది అమాంతం. తనని ఆ విధంగా కని పెట్టి చూడటం, వెనకనుంచో ముందునుంచో పక్కలనుంచీ, తెలి యటంలేదు. తుపాకీ ఎత్తలేకుండా ఉన్నాడు. ప్రాణభయంతో నవనాడులూ కుంగిపోతున్నాయి.

ఇంతలో ఆ ఎలుగుబంటి వెళ్ళిపోయింది. ఎంత తమాషాగా వచ్చిందో, అంత తమాషాగానే వెళ్ళిపోయింది. వడ్రంగి పిట్ట ఒక్కటే నిశ్శబ్దాన్ని భంగపరుస్తోంది. కుక్కలు మొరిగి నట్టయి, మళ్ళీ అదీ వినిపించడం మానేసింది. బహుశా, వేట కుక్కలు వేరొక ఎలుగుబంటిని తరుముతున్నాయేమో! పేము పొద వెనకనుంచి సామ్ వచ్చాడు. అతని వెనకనే చిన్నకుక్క పిల్ల వస్తోంది. పక్షిలావున్న ఆ కుక్కపిల్ల అతని కాళ్ళ దగ్గిర నిల బడి, పేముపొదల వంక ఆశ్చర్యంగా చూస్తోంది.

"సామ్, ఎలుగుబంటి నాకు కనిపించలేదు," అన్నాడా కుర్రవాడు.

"మీకు కనిపించి వుండదు; అది మిమ్మల్ని చూసివుం టుంది," అన్నాడు సామ్.

"లేదు. నేను జాగర్తగానే చూస్తున్నాను."

"మీకంటె జాగ్రత్తమంతు రాలది. ఆ ఎలుగుబంటిని పట్టు కోగల వేటకుక్క మనదగ్గిరలేదు," అన్నాడు సామ్. కుర్రవాని మోకాళ్ళదగ్గిరికి వచ్చి, ఆ కుక్కపిల్ల వొణుకుతూ నుంచుంది; దానిగాయం మీది రక్తబిందువులు చెమరుస్తున్నాయి.

తను ఆ పెద్ద ఎలుగుబంటిని చూడాలి: లేకపోతే, తనతండ్రీ, మేజర్ డిస్పెయిన్ మొదలైన వారు విఫలులైనట్టే, తనూదానిని పట్టలేక ఓటమిని అంగీకరించవలసి వస్తుంది — అనుకున్నాడా అబ్బాయి. గాయపడ్డ వేటకుక్కల మొహాలు మొట్ట మొదటిసారి చూసినప్పుడు, అతనికి భయమంటే ఏమిటో అవగాహన మయింది. ఎంత పెద్దదయితేమట్టుకు, ఈ ఎలుగుబంటి తమకి ఎందుకు లొంగకుండా వుండాలి? అది లొంగాలనే వాంఛితానికి అట్టడుగున ఉన్నది భయమే! ఆ ఎలుగుబంటి నన్ను చూసింది; నేను దాన్ని చూడగలుగుతాను — అని తీర్మానించు కున్నాడు ఆ కుర్రాడు.

మరుసటి సంవత్సరం జూన్ లో ఆ అబ్బాయి తండ్రీ వాళ్లందరూ మళ్లీ కాంపు వేశారు — ఈసారి మేజర్ డిస్పెయిన్, జనరల్ కాంప్సన్‌ల జన్మదినోత్సవాలు జరిపేందుకు. వాళ్లు పుట్టిన తేదీలు ఎప్పుడైనా, జన్మదినోత్సవాలు జరుపుకునేందుకు, అది సరైన సమయము అనుకున్నారు. వీళ్లందరూ అక్కడ చేసేదేమంటే, కాంపులో కూచుని చక్కగా వంటలు చేయించుకుతినడం, కడుపునిండా విస్కీ తాగడం; నీగ్రోనౌకరులు వేటాడి తీసుకొచ్చినవి, అవి తామే వేటాడినట్టుగా గప్పాలుకొట్టడం. అఖరికి ఆ అబ్బాయి తండ్రి, ఆ తండ్రి వెంటవచ్చిన వాల్టర్ కూడా, తమ గురిని పరీక్షించుకునేందుకు, పందాలు వేసుకు, సీమ కోళ్లని మట్టుకు కాల్చేవారు.

నాన్నా వాళ్లూ తను ఉడతలు పడుతున్నాడని అను కున్నారు. సామ్ ఫాదర్స్‌కూడా మొదటి మూడు రోజులూ

అలాగే అనుకున్నట్టున్నాడు. ప్రతి ఉదయం బ్రేక్ ఫాస్టు అవగానే తను వెళ్లిపోయేవాడు. క్రిస్టమస్ ప్రజంటుగా యిచ్చిన తన తుపాకీ తనకి వుంది. జనరల్ కాంప్సన్ యిచ్చిన దిక్సూచి చేత బుచ్చుకు, వెనకటి తుమ్మచెట్టు దగ్గిరికి వెళ్లేవాడు. వెనకవచ్చి నప్పుడు నేల కొరికినట్టుగా కనిపించిన మ్రానూ, తిరిగీ నుంచు నేందుకు ప్రయత్నిస్తున్నట్టుగా ఉంది. ఆశ్నెల్లక్రితం కంటె యిప్పుడు దట్టంగా కనిపిస్తోంది అరణ్యం; మిట్టమధ్యాహ్నం వేళ కూడా సూర్యకాంతి అంతంతగానే ఉంటోంది. ఎక్కడికక్కడ నీటి పాములూ బురదపాములూ జలజల పారుతున్నాయి;ఆకో పామో కదిలేదాకా కనిపించడం లేదు. రెండురోజులయాక, మూడో రోజు సాయంత్రం వేళ సంజె కాంతిలో, సామ్ కనిపించాడు.

"మీరు సరిగ్గా వెతకడం లేదు," అన్నాడు సామ్.

క్షణకాలం ఆ అబ్బాయి సమాధానం చెప్పలేదు. పిల్ల కాలవమీాద కట్టిన చిన్న పిల్లలరాళ్ల వంతెన దానంతటది కూలినట్టు, "ఎలా కనపడుతుందో చెప్పవ్ ఆ ఎలుగుబంటి? మనం వెనకటి సారివెళ్లిన చెట్టుమ్రాను దగ్గిరికే నేను మూడురోజుల బట్టీ వెళ్తు న్నాను," అని అన్నాడు ఆ కుర్రవాడు.

"అయితే, అది మిమ్మల్ని కనిపెడుతూవుంది, మీారు చూసి వుండరు."

"నేను చూసి వుండనా?" అన్నాడా అబ్బాయి ఆశ్చర్య పోతూ.

"తుపాకీ చూసి అది అటువైపుకి వచ్చి వుండదు," అన్నాడు సామ్. "భయపడకుండా వుండటం కష్టంగాని భయ

పడకూడదు. అరణ్యంలోని ఏ జంతువూ మనం హింసిస్తే గాని మనని హింసించదు: మనం బెదురుతున్నామని తెలిసిందా, మీద పడుతుంది. ఎలుగుబంట్లుగానీ, ఏ జంతువులు గానీ పిరికి వాళ్లని యిట్టే పసిగడతాయి. ధైర్యవంతులమని పైకి చెప్పుకునేవారి అంతర్యంలోని పిరికిదనమే ప్రమాదకరం."

'తుపాకీ ఏంచేసేది?__చేతిలో తుపాకీ లేకుండా ధైర్యంగా నుంచోగలనా?' అని తలపోశాడు ఆ కుర్రాడు.

మర్నాడు, రోజూకంటె తొందరగాబయలుదేరాడు కాంప్‌నుంచి. చేతిలో దిక్సూచి, పాముల్నికొట్టేందుకు కర్రా చేత వుచ్చుకు బయలుదేరాడు. మైలుదూరం నడిచేదాకా, దిక్సూచి ఉపయోగించవలసిన పనిలేకపోయింది. తర్వాత తిన్నగా ఆ చెట్టుమ్రానుదగ్గిరికి చేరుకున్నాడు. అరణ్యం అప్పుడే నిద్ర నుంచి లేస్తున్నట్టు వుంది.

ఒకజింక, జింకపిల్ల కనిపిస్తే వాటిమీదుగా దూకాడు. జింకపిల్ల తనవెంట గబగబా పరిగెత్తుకొస్తోంది. అది అంతచక్కగా పరిగెడుతుందని తనకి తెలియనే తెలియదు. ఇవ్వాళ తను తుపాకీ లేకుండా వచ్చాడు. పెద్దఎలుగుబంటి యిన్నాళ్లూ తనని వేటకానిగా భావిస్తోంది కాబోలు! దానివిషయంలో తనకి అటువంటి చెడుతలంపులు ఏనాడూ లేవు. తను భయపడకూడదని కదా సామ్ చెప్పాడు; తనుభయపడడు. భయమనే భావాన్ని తనమనసులోనుంచి తుడిచివేస్తాడు.

మధ్యాహ్నమయ్యేవేళకి చాలాదూరం నడిచాడు; దిక్సూచి సాయంతో ముందుకి సాగుతూ, తాతగారి జేబుగడి

యారంవల్ల కాలప్రమాణం తెలుసుకుంటున్నాడు. దిక్సూచి, జేబుగడియారం, చేతికర్ర - ఈమూడే అతని మిత్రులు ఆ మహారణ్యంలో. బసదగ్గిరనుంచి బయలుదేరి తొమ్మిదిగంటల పైగా అయింది; ఇంకో గంటలో సాయంత్రమవుతుంది. దిక్సూచి సాయంతో రకరకాల వృత్తాలలో నడిచాడు. ఈ వృత్తాలు గీయడంలో నానాశ్రమాపడి, ఒకచోట కొంచెంగా దారితప్పాడు. చిట్టచివరికి, ఆ విరిగిన చెట్టుమ్రాను దగ్గిరికి చేరుకున్నాడు.

ఆ మ్రానుమీదకూచుని చుట్టూ కలియజూశాడు; పామ్మాటలు జ్ఞప్తికొచ్చాయి. తనుగుర్తుగా పెట్టుకున్న చెట్టు వంకచూశాడు. పొదలమాటున తనకి ఎలుగుబంటి కనిపించినట్ట యిందికాని అది బయటికిరాలేదు; అక్కడే నుంచునివుంది; కదలక మెదలక నిశ్చలంగా నుంచునిఉంది. తను కలలలో భావించినంత బృహదాకారంతోవుంది ఈ ఎలుగుబంటి. తను ధయిర్యంగా ఆ చెట్టుమ్రానుమీద కూచున్నాడు; భయపడ్డట్టు వెనక్కితిరగ లేదు.

ఎలుగుబంటి యిందాకటినుంచీ నుంచున్న చోటునుంచి కదిలింది. ఏమీశబ్దం చెయ్యలేదు. తొందరపడలేదు. ఎదురుగా వున్న వనమార్గంలోకి, అవతలపక్కగా తిరిగింది. కొంచెం దూరంగావెళ్లి నిలబడి, ఆ కుర్రవానిని మరొకసారిచూసి, తన దారిన వెళ్లిపోయింది.

అది అడవుల్లోకి పోలేదు; పొదలచాటుకిపోయింది. నీటి పైన నిమేషమాత్రం కనిపించి నీటిలోకి నిర్గమించే చేపలావెళ్లి పోయింది ఆ ఎలుగుబంటి.

మరునాటి సంవత్సరం వచ్చినప్పుడూ మళ్లీ చూడవచ్చు ననుకున్నాడు కాని, పడలేదు. ఆ అబ్బాయికి పధ్నాలుగేళ్లు వచ్చాయి. ఈ లోగా చెవ్రులపిల్లుల్ని వేటాడంలో మొనగాడయాడు. పధ్నాలుగేళ్లు వచ్చేటప్పటికి ఆ అబ్బాయికి, ఆ అడవి అంతా క్షుణ్ణంగా తెలిసింది. వాళ్ల బసకి ముప్ఫయిమైళ్ల చుట్టు పక్కలనున్న ప్రదేశమంతా అతనికి కళ్లకికట్టినట్టు తెలుసు.

తనపాదాల గుర్తులకంటె, పెద్ద ఎలుగుబంటి పాదాల గుర్తులు అతనికి బాగా తెలుసు - దానిపాదాలలో ఒకటి మడత పడ్డపాదం. ఆకారణంగా దాని పాదాలగుర్తు సులభంగా తెలుస్తుంది. ఆ అడవిలో ఉన్న యితర ఎలుగుబంట్లకీ ఈ పెద్దఎలుగు బంటికీ చాలా తేడాఉంది. మూడు సంవత్సరాలక్రితం తనుచెట్టు ప్రమానుమీద కూచునివుండగా, తనూ ఆ పెద్ద ఎలుగుబంటీ కలుసుకోవడం అతను మరవలేకుండా ఉన్నాడు. ఈ చిన్న బాలుడూ, ఆ వృద్ధజంతువూ ధ్వని ప్రధానంగాని భాషలో మాట్లాడుకున్నారు.

మూడు సంవత్సరాల తర్వాత మళ్లీ కనిపించింది ఆ ఎలుగుబంటి; అడవి దుప్పికంటె వేగంగా పరుగెడుతూండగా చూశాడు దానిని. అంత వేగంగా ఎగిరిపోయేది తుపాకీకి దొరుకుతుందా? సామ్‌ఫాదర్స్ ఒకసారి 'ఫైన్' అనే చిన్నరకం మొండి కుక్కగురించి చెప్పాడు. దానితో ప్రయత్నిస్తే!!

నాలుగు రోజులయాక, 'ఫైన్' వేటకుక్కనిపుచ్చుకు, అక్కడికొచ్చాడా అబ్బాయి. ఫైన్ మరొక రెండువేట కుక్కలూ, సామ్‌ఫాదర్సూ తనూవచ్చారు. వేటకుక్కలని పెద్ద

ఎలుగుబంటిమీదికి వుసిగొల్పారు. ఆ అబ్బాయికి పెద్దఎలుగు బంటి వుండే స్థలమూ అదంతా తెలుసుగా ! వేటకుక్కలు మరీ దగ్గిరికివచ్చేదాకా ఆశ్చర్యపోతూ చూసింది ఎలుగుబంటి. ఆపైన ఒక్కసారి వెనక్కితిరిగి, నిట్టనిలువుగా భయంకరాకారంతో నుంచుని, ఆ వేటకుక్కల పని పట్టించింది. ఫైస్‌మట్టుకు తన మొండిపట్టు విడవలేదు. అప్పుడా కుర్రవాడు, తుపాకీ అవతల పారేసి, గబగబా ఎలుగుబంటిదగ్గిరికివెళ్లి, ఆఫైస్‌ని వెనక్కి లాగాడు. ఆ లాగుతున్నప్పుడు అతను అక్షరాలా ఎలుగుబంటికి అడుగున వున్నాడు. కాని, ఎలుగుబంటిమాత్రం ఈ కుర్రవానితో ఏమిటిలే, అన్నట్టు తనదారిన తను నడిచివెళ్లిపోయింది. అది వెళ్లి పోవడం అతను చూడలేదు. ఇంతలో తుపాకీచేతబుచ్చుకున్న సామ్‌ఫాదర్స్, నేలమీదకి వొంగివున్న అ అబ్బాయిదగ్గిరికి వచ్చాడు.

"రెండుసార్లూ చేతిలో తుపాకీ వుంచుకుకూడా దాన్ని వొదిలేశారేమిటి?" అన్నాడు సామ్.

కుర్రవాడు లేచి నుంచున్నాడు. చేతుల్లోవున్న ఫైస్ అతిదీనంగా రోదిస్తోంది. మిగతా వేటకుక్కలురెండూ ఏడ్చిఏడ్చి నీరస పడ్డాయి. ఫైస్ వణకడం మానేసింది, యమ యాతనతో కొట్టు కుంటోంది.

"నేను చంపలేకపోయాను, సరే. తుపాకీ చేతిలోవుంచి నువ్వుమాత్రం చంపగలిగావా?" అని అడిగాడు పధ్నాలుగేళ్ల కుర్రవాడు సామ్‌ఫాదర్స్‌ని.

"అయితే దాన్ని కాల్చలేదన్నమాట. ఎంతదూరంలో ఉంది?" అని అడిగాడు తండ్రి.

"ఎంతదూరమో చెప్పలేను. దాని కుడిపాదంలో ఏదో కర్రముక్క గుచ్చుకుంది. అదీగాక నాదగ్గిర తుపాకీ లేదప్పుడు," అన్నాడు ఆ అబ్బాయి.

"తుపాకీ చేతనున్నప్పుడు కాల్చావు గనకనా?"

ఆ అబ్బాయి సమాధానం చెప్పలేదు. గదిలో పరిచిన ఎలుగుబంటి చర్మాలమీద వచార్లు చేస్తున్నాడు తండ్రి. తమ యింట్లో ఎన్నిరకాల జంతుచర్మాలు ఉన్నాయో! ఒక్కొక్క చర్మం ఒక్కొక్క కథ చెబుతుంది.

రకరకాల ఆలోచనలతో మధన పడుతున్న తండ్రి, పుస్తకాల సొరుగులో నుంచి ఒక పుస్తకం తీసి, పేజీలు తిప్పి, ఒక పద్యంలోని ఆఖరు రెండులైనులూ చదివాడు. "ఆనందం యివ్వలేక పోవచ్చుగాని అందం చెడదు; ప్రేమ ఉన్నంతకాలమూ ఆమె సుందరమూర్తి."

"ఆ కవి ఎవరో స్త్రీ గురించి వర్ణిస్తున్నాడు," అన్నాడు కొడుకు.

"కాదు. అతను 'సత్యము' గురించి చెబుతున్నాడు. సత్యస్వరూపం మార్పులేనిది. ఏకత్వమేగాని వివిధత్వంకాదు. ఆత్మగౌరవము, వంశప్రతిష్ట, దయాంతఃకరణ, ధర్మ బుద్ధి,

ధీరత్వమూ, ప్రేమగుణమూ - అను పేర్లతో అది హృదయవీణ మీద మ్రోగుతుంది. నీ కర్థమవుతోందా?" అని అడిగాడు తండ్రి.

ఆ కుర్రవాడికి అర్థంకాలేదు. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు పోగొట్టుకోవడం యిష్టంలేని ఎలుగుబంటి ఆత్మాభిమానం గురించి కాబోలు ఏమిటో అంటున్నాడు ఆ తండ్రి! తండ్రి చెప్పదలుచుకున్నది, ఆ మాటలవల్ల గాక మరోవిధంగా అర్థమయింది కుర్రవానికి.

ఆరు పౌనులు వుండే ఫైన్‌ని, అంత పెద్దదయిన ఎలుగుబంటి నుంచి విడదీస్తున్నప్పుడు, అతనికేదో కొత్త విషయం తెలిసినట్టయింది. "నేనెంత చిన్నదాన్ని! నావల్ల జరిగే ప్రమాదమేముంటుంది? నేను చేసేది వొట్టిశబ్దం. నేల మీద నిలబెడితే, నేను వున్నట్టే వుండను. ఎవరి నీడ నా మీదపడుతోందో కూడా తెలుసుకోలేనంత చిన్నదాన్ని! నాకు ఆత్మలేదని మీరు ఏనాడో చెప్పేశారు కాబట్టి, నేను స్వర్గానికి వెళ్తానో వెళ్ళనో నాకు తెలియదు. నాకు వున్నదల్లా మొండిధైర్యం. అందరూ అల్లరి చేస్తున్నానని అనుకున్నా, ఆ మొండిధైర్యమే నేను!" అని ఫైన్ తన చెవిలో చెప్పినట్టనిపించింది ఆ కుర్రవానికి.

తను పెద్ద ఎలుగుబంటి గురించి ఎంత కాలంగానో విన్నాడు; దానిని చూశాడు. దాని నివాసస్థలం తెలుసుకున్నాడు.

తన చేతిలో తుపాకీ వుండగా అది కనిపించి నప్పుడు, దానిని కాల్చ లేక పోయాడు. ఈ చిన్న కుక్కపిల్ల వల్లనా? ఈ కుక్క ఆ ఎలుగుబంటి దగ్గిరికి వెళ్ళడానికి పూర్వమే కాల్చేసి వుండవచ్చు. లేదా సామ్‌ఫాదర్స్ కాల్చి వుండవచ్చు. అతనూ కాల్చలేదు.

తండ్రి కొడుకుని ఆ సంజెకాంతిలో పరిశీలనగా చూస్తున్నాడు. "ఆత్మ గౌరవము, వంశప్రతిష్ట, దయాంతఃకరణ, ధర్మబుద్ధి, వీరత్వము, ప్రేమగుణము - ఈ ఆరూ హృదయ వీణ మీద మ్రోగుతాయి." అన్నాడు ఆ అబ్బాయి తండ్రి.

"నీకర్థమవుతోందా?" అని అడిగాడు కొడుకుని.

"అవుతోంది" అన్నాడు కొడుకు. అంతే!

# అణుశక్తి

## గార్డెన్ ఈవాన్స్ డీన్ రచనకి
## ఎస్. ఆర్. చందూర్ అనువాదం

మేము ప్రచురించిన పుస్తకం గురించి మేము చెప్పుకునే బదులు పత్రిక లేమన్నారో చెబుతాము:

* * *

ఆంధ్ర పత్రిక, మద్రాసు

ఇది సామాన్య పాఠకుల ఉపయోగం కోసం వ్రాసిన పుస్తకం. మూలగ్రంధ రచయిత 1950 మొదలుకొని 1953 దాకా అమెరికాలో అణుశక్తి సంఘానికి అధ్యక్షులుగా ఉండేవారు.

ఇది ఎక్కువగా అణుశక్తి ప్రజావసరాలకు ఉపయోగపడే విధానాన్ని గురించి వ్రాసిన పుస్తకం.

అణుశక్తి క్రమక్రమంగా ప్రపంచ స్వరూపమే మార్చి వేయగలదని ప్రపంచ మేధావు లెందరో ఊహాగానాలు చేస్తున్నారు. అప్పుడే కొన్ని పారిశ్రామిక రంగాల్లో కొంచెం కొంచెంగా అణుశక్తి వినియోగం కూడా జరుగుతున్నది.

ఇందులో ఈ విషయానికి రెండు పెద్ద ప్రకరణాలు ప్రత్యేకించారు. వాటిలో ఆటమ్ రియాక్టర్లను గురించీ రేడియో ఐసోటోపులను గురించీ వివరించి వ్రాశారు. ఇంకా వైద్యవిధానాల్లో వీటివల్ల కలిగే మార్పులను గురించి కూడా సూచించారు.

అనువాదంలో ఎన్. ఆర్. చందూర్ చాలాచోట్ల మూలగ్రంథం సంక్షేపించారని తెలియ జేస్తున్నారు. వీరి అనువాదం సరళమయిన సులభశైలిలో సుగమంగా సాగిపోతున్నది. తెలుగులో ఇటీవల బయలుదేరుతున్న వైజ్ఞానిక గ్రంథాలలో ఇది ఎన్నదగిన పుస్తకం.

చిన్నదైనా నేటి అణుశక్తి సమస్యలను గురించి తెలుసుకోడానికిది బాగా ఉపయోగించగలదు.

*　　　*　　　*

## ఆంధ్ర ప్రభ, మద్రాసు

నిన్న మొన్నటిదాకా అణు సంఘానికి అధ్యక్షుడుగా వున్న గార్డన్ డీన్ ప్రామాణిక గ్రంథ మిది. యుద్ధరంగం లోను, శాంతియుత కార్యాలకూ అణుశక్తి పరిశోధన, ఏ విధంగా తోడ్పడగలదో, రక్షణ నిబంధనలను అతిక్రమించకుండా చెప్పారు రచయిత. మొదటి రోజులలోని పరిశోధనలు హిరోషిమా నాగసాకీనాటి యాటంబాంబులుగా యెలా పరిణమించాయో, తర్వాత ఆ విస్తృత కార్యక్రమం ఈ నాడు ఏరూపు తీసుకుంటున్నదో వివరించారు.

*　　　*　　　*

## కృష్ణాపత్రిక, మచిలీపట్నం

1945 ఆగస్టులో హిరోషిమా నగరం భస్మీపటలం కావడంతో అణుశక్తి అనేది భూలోకం మీద ప్రత్యక్షంగా అవతరించింది.

ఈ నాడు అణుశక్తిని గూర్చినీ, అణ్వాయుధాలను గూర్చినీ వార్తలు, వ్యాఖ్యానాలు, వివరాలు, వ్యాసాలు పత్రికల నిండా కప్పతిప్పలుగా వెలువడుతున్నాయి. దీనికి అణుయుగం అనేపేరుకూడా ప్రచారంలోకి వచ్చింది.

అణు స్వరూపాన్ని గూర్చిన నిరిదలక్షణ్జానం సంపాదించాలంటే సాంకేతికమైన శాస్త్రీయమైన పాండిత్యం చాలా కావాలి. అట్టిది మనకు వున్నా లేకపోయినా, అణు శక్తి అనేది మన వినాశనానికి గాని అభ్యుదయానికి గాని నిత్యసిద్ధమై కూర్చున్నదనే విషయంలో యెవ్వరూ అనుమానించడానికి ఆస్కారం లేదు.

యుద్ధ సన్నద్ధమైన రాజ్యాలు అణుశక్తిని శత్రునాశనానికి వినియోగపరచడానికి సిద్ధపడుతూవున్నా, దీన్ని రంగా వినియోగించుకోడానికి విపులావకాశం వున్నట్లు విజ్ఞులు భావిస్తున్నారు.

కాగా ప్రపంచ శాంతిని అభ్యుదయాన్ని వాంఛించే ప్రతివ్యక్తి అణుశక్తిని గూర్చి పరిజ్ఞానం సేకరించడం అవసరమవుతున్నది. అట్టి పరిజ్ఞానాన్ని ఈ గ్రంథం చాలా వరకు కలిగించ గలిగిందిగా వున్నది.

* *

1/8 క్రవున్ సైజు 160 పేజీలు

వెల ఒక రూపాయి

ప్రతిమా బుక్స్

49 మూకతాల్ వీధి : : మద్రాసు-7

# ప్రతి గురువారం

## జేన్. ఎస్. మెక్లివిన్ రచనకి

## ఎస్. ఆర్. చందూర్ అనువాదం

*

ఇది పత్రికలు నడిపేవారి కష్టనిష్ఠురాలకి సంబంధించిన పుస్తకం. మెక్లివిన్ సతి తన అనుభవాలు ఒకటి తర్వాత ఒకటిగా చెబుతుంది. ఈ కథని యూనివర్సల్ ఇంటర్నేషనల్ వారు 'పిక్చర్'గా తీశారు.

తెలుగులో ఈ పుస్తకం వెలువడ్డాక పత్రికలు ఏమన్నాయంటే:

* *

In this easy rendering of the autobiographical story "It happens every Thursday" is ably brought out the zest for life peculiar to the American people. The book tells the story of a young and enthusiastic urban couple who exchange the placid, happy family life and a secure job to the cares and thrills of running a weekly journal in downtown. The adventure is a true partnership in every sense of the word, and both husband and wife realise that while the country editor's life is full of toil, tears and sweat, to add to the problem of making both ends meet and bringing up the babies, it is not without its compensations as a labour of love that gives them a supreme sense of self-fulfilment in life's endless struggle.

*The Hindu*, **Madras.**

* *

---

జర్నలిస్టులుగా వున్నవారేమి, కావాలని ఉబలాట పడుతున్న వారేమి ఈ గ్రంథాన్ని చదివి నేర్చుకోదగిన విశేషాలు చాలా వున్నాయి.

ఇందులో ఈ క్రింది వాక్యాలు గమనించదగినవి :

'పత్రికకి ఎప్పుడూ ప్రజాబలం వెనక వుండాలి. మేము ప్రచురించేవార్తల్లో నూటికి తొంబయితొమ్మిది సర్వ సామాన్యమైనవే. నిత్యకృత్యంలో జరిగేవే. కాని ఆ సర్వ సామాన్యవిషయాల చుట్టూ ప్రజాజీవితం పరుగులెడుతూ వుంటుంది. వాటికి కేంద్రస్థానం ప్రజ. మాకు కావల్సింది ఆ ప్రజా, ఆ ప్రజాబలమూ; అది మర్చిపోయి మేము నిరుత్సాహపడితే, మా పత్రికా ధర్మాన్ని సరిగ్గా నిర్వర్తించ లేక పోయామన్న మాటేగా!'' (77 పుట)

ఒక కార్యాన్ని సాధించడంలో చూపవలసిన ఆసక్తి, పట్టుదల, ధైర్యోత్సాహాలు ఏలా వుండాలో ఈ గ్రంథం చదివితే చక్కగా తెలుస్తుంది. అందరూ తప్పక చదవ తగ్గది ఈ చిన్నవృత్తాంతం. తెలుగు అనువాదం చక్కని శైలిలో సరళమైందిగా వున్నది.

కృష్ణాపత్రిక, మచిలీపట్నం

మెక్లీన్ దంపతులు, గత యుద్ధానంతరం దవ్రునింగ్ టౌన్‌లో "ఆర్కాయివ్" అనే చిన్న వారపత్రికను నడపడంలో, వార్తాసేకరణ, ప్రచురణ సేకరణ, ప్రింటింగ్, డిస్పాచ్ మొదలైన పత్రికా నిర్వహణ కార్యకలాపా లన్నిటి లోను పడే కష్టనిష్ఠూరాలను, సాధించిన విజయాలలో పొందే సంతృప్తిని వివరించే పుస్తకమిది. ఒక పత్రికను నడిపేవారి జీవితానికి చక్కని ప్రతిబింబమని చెప్పవచ్చు. అమెరికన్ ప్రజలకు జీవితంపట్ల గల దృక్పథం, దీక్ష వ్యక్తంచేసే ఈ రచన చాలా సరళంగా, హృద్యంగా వున్నది. యూనివర్సల్ ఇంట ర్నేషనల్ వారు ఈ కథను చిత్రంగా నిర్మించారు కూడా.

ఆంధ్ర ప్రభ, మద్రాసు

* * *

ఒక చిన్నపట్టణంలో వార్తాపత్రికను నడిపే భార్యా భర్తల అనుభవాలిందులో చక్కగా యిమిడ్చినారు. ఇప్పు డిప్పుడే ఒకదారికి వస్తున్న భారతీయ పత్రికా విలేఖరులు నేర్చుకొనే విషయాలిందులో అనేకము ఉన్నవి.

గోల్కొండ పత్రిక, హైదరాబాద్

* * *

వెల 12 అణాలు


ప్రతిమా బుక్స్

49 మార్కెట్ వీధి : : మద్రాసు-7

